## గృహ్యాగ్నిప్రతిష్ఠ

ఉద్వాహార్థం పాకయజ్ఞాద్యశేషస్మార్తాఖ్యానాం
కర్మణాం హోమసిద్ధ్యై హోమాశేషాణాంహ
విశ్వస్య సాధ్యశ్రౌతాగ్నీనాం హేతుభూతం ప్రధానం।౧౬౭।
లోకారణీభ్యాం మథితానలంవా సచ్ఛ్రోత్రియాగారత ఆహృతంవా
అలంకృతాయాం శుభవేదికాయా మగ్నిప్రతిష్ఠాపనమత్రకుర్యాత్।

కన్యాదానానంతరము వివాహము, ఔపాసనాదిపాకయజ్ఞములు, హవిర్యజ్ఞములు శ్రౌతాగ్నులు మొదలగు కర్మల హోమసిద్ధికి హేతుభూతమైనదియు, ప్రధానమైనదియు,అగు అగ్నిని మథించి గాని, శ్రోత్రియగృహమునుండి తీసికొని వచ్చిగాని, అలంకృత వేదిక యందు ప్రతిష్ఠించవలెను.

ఉద్వాహవహ్నిః పరిరక్షణీయః ప్రయత్నతో ధార్మికతి్త్రభిస్స్యాత్

ఇట్లు ప్రతిష్ఠించబడిన గృహ్యాగ్నిని ప్రయత్నపూర్వకముగా పరిచర్యులు (సేవకులు) రక్షించుచుండవలెను.

## మధుపర్కపూజ

ప్రత్యేత్య సప్రాఙ్ముఖ ఆసనాహార్ణపీఠోపవిష్టో హి వరోతి హృష్టః।
విప్రైస్సుహృత్పుత్రకళత్ర సమన్వితేన స్రగ్వస్త్రగంధమణిభూష
ణభూషితేన। భద్రాసనే సముపవిష్టఉదగ్దిశ్రో దాత్రా సమర్పిత
మహామధుపర్కపూజాం ॥౧౭౦।

గృహ్యోద్యాదితేసవిధినైవ హి కూర్చపాద్యా ద్యుక్తోపచారసహితాం
ప్రతిగృహ్య చాథ గంధాక్షత స్రగుపవీతసుగంధవాసోలంకార జాత
మఖిలం ప్రతిగృహ్యాతత్ర ।౧౭౧।

ఇట్లు గృహ్యాగ్నిప్రతిష్ఠ జేసి వివాహగృహమునకు తిరిగివచ్చి, అతిసంతోషయుక్తుడగు వరుడు ఆసనమునందు ప్రాఙ్ముఖముగా నాసీనుడయి బ్రాహ్మణులు, మిత్రులు, పుత్రులు, కళత్రము మొదలగువారితో గూడికొన్నట్టియు,వస్త్రమణిగంధభూషణ భూషితుడైనట్టియు, భద్రాసనమందు ఉత్తరాభిముఖముగా, నాసీనుడైనట్టియు, దాతచే నివ్వబడినదియు,అర్ఘ్యపాద్యాద్యుపచార సహితమైనదియు, అగుమధుపర్కపూజనుపరిగ్రహించి పిమ్మటదాతచే నివ్వబడినగంధము, అక్షతలు, పుష్పమాలికలు, యజ్ఞో

పవిత్రమువస్త్రము అలంకారములు మొదలగు పదార్థములను పరిగ్రహించవలెను.

## సుముహూర్తము

యావజ్జ్యోతిర్విదుక్తం లగ్నం వదేయుస్తావత్కల్యాణాష్టకంచూర్ణికాంచ
లగ్నే ప్రాప్తేన్యోన్యమాలోకనీయంవాస్యైశీర్షేణాశ్చర్కరాజీరకేస్తః

అనంతరము జ్యోతిష్కుడు చెప్పిన సుముహూర్త పర్యంతము మంగళాష్టకములను చూర్ణికను పఠించి సుముహూర్తమయినవెంటనే వధూవరులు పరస్పరము జూచుకొని శిరస్సులయందు పరస్పరము గుడసహితముగు జీలకఱ్ఱను ఉంచుకొనవలెను.

కన్యాందృష్ట్వా భ్రాతృమంత్రంజపిత్వాతామీక్షేతాఘోర మంత్రే
ణచాథ। ఆశీఃకార్యాబ్రాహ్మణైర్వేదవిద్భిఋగ్భిశ్చస్త్రైస్నామభిర్వా
యజుర్భిః॥౧౭౩

తర్వాత కన్యకను వరుడు చూచి "అభ్రాతృఘ్నీం" అను మంత్రమును జపించి, "అఘోర చక్షుః," అను మంత్రముచే ఆకన్యకను చూడవలెను. అనంతరము, వేదవేత్తలగు బ్రాహ్మణుల వలన మంగళకరంబులగు ఋగ్యజుస్సామములచే ఆశీర్వాదమును పొందవలెను.

## వరవధూసంకల్పము

దర్భేష్వాసీనౌ వరవధ్వౌసంకల్పయేతఆవాభ్యాంకర్మాణి కర్తవ్యాని
ప్రజాశ్చోత్పాదయితవ్యాఇత్యనయోర్మైమిత్రికేహ్యవిమయూః॥౧౭౪

దర్భలయందాసీనులగు వధూవరులు "ఆవాభ్యాంకర్మాణి కర్తవ్యాని ప్రజాశ్చోత్పాదయితవ్యాః" కర్మలను మనము చేయవలెను. సంతానము పుట్టించవలెను" అని సంకల్పమును చేయవలెను.

## వధూభ్రూమార్జనము

ధృత్వాంగుష్ఠానామికాభ్యాంచదర్భంలిస్యాద్సంమృజ్యభ్రువోరంతరంహి
మంత్రేణైతత్ప్రతీచీంనిరస్యేదంభస్స్పృష్ట్వారౌద్రరాక్షేతిమంత్రాత్

అంగుష్ఠానామికలచే వరుడు దర్భనుపట్టుకొని వధువుకనుబొమ్మలమధ్యను "ఇదమహం" అనుమంత్రముచే తుడిచి, దర్భను పశ్చిమదిశయందు పడవేసి "రౌద్రరాక్షస" అనుమంత్రమునందు చెప్పబడుటవలన ఉదకోపస్పర్శనము చేయవలెను.

## యుగచ్ఛిద్రాభిషేకము

శ్లోకే ప్రాప్తే చేజ్జపేదుక్తమంత్రంయుగ్మాన్విప్రానేకకార్యార్థయుక్తాన్

హించి ‹‹పూషాత్వేతో నయతు›› యను మంత్రముచే నగ్ని సమీపమునకు దీసుకొని వెళ్లి అగ్నికి పశ్చిమభాగంబున ఉండవలెను.

ప్రధానహోమాదులయందు దక్షిణవధూనిర్ణయము

వధ్వాసహాగ్నిమభిగమ్య చ తస్య పశ్చిమే పీఠాదిషూపవిశతో యుగప
ద్వధూవరౌ తత్రోత్తరో వర ఇతీరణతో వివాహకర్మాదిమాష్టవిధకర్మ
సు చోత్తరో వరః ॥౧౬॥ ప్రధానహోమో యదృదాదిహోమః ప్ర
వేశ ఆగ్నేయచరోశ్చ హోమః తథైవ హోమో హృదయాభి
సంగమస్సీమంతకః పుంసవనాఖ్యహోమః ॥౧౭॥ ఏతేషు హోమే
ష్వపి చోత్తరో వరశ్చాసీన ఆచార్యకరోతి కర్మాణి ఆరభ్య చాబ్రహ్మ
విసర్జనాంతతః ఫలప్రదానేऽపి తథోత్తరో వరః ॥౧౮॥

ఇట్లు వధూసహితుడై అగ్ని సమీపమునకు వెళ్లి, అగ్నికి పశ్చాద్భాగమున పీఠాదులయందొక్క పర్యాయము కూర్చుండవలెను ‹‹ఉత్తరో వరః›› ఆప-గృ-౪-౮- అనుట వలన వివాహాద్యష్టవిధకర్మలయందు వరుడు ఉత్తరమున కూర్చుండవలెను. ప్రధానహోమము, యదృదాదిహోమము, ప్రవేశహోమము, ఆగ్నేయస్థాలీపాకము, వివాహశేషహోమము, హృదయసంసర్గహోమము, సీమంతము, పుంసవనహోమము అనునీ ఎనిమిదికర్మలయందు ఉత్తరమున వరుడాసీనుడై సంకల్ప ప్రభృతి బ్రహ్మవిసర్జనాంతము చేయవలెను. ఫలప్రదానము (ప్రశ్నస్థలు) నందు ఉత్తరమున వరుడు ఉండవలెను.

అహోమహోమాత్మకసర్వకర్మసు స్మార్తేషు పత్నీ చ పతేశ్చ దక్షిణే
కర్తోత్తరస్యాం దిశి చాసనస్థో ముతాసు రాగ్ర్యకరోతి చాఖిలం ॥౧౯॥

హోమరహితములు, హోమసహితములు, అగు సమస్త స్మార్తకర్మలయందు తన దక్షిణభాగంబున పత్నినికూర్చుండజేసి తానుత్తరమున నాసీనుడై ప్రాణాయామప్రభృతి సమస్తముచేయవలెను.

కామ్యవ్రతోద్యాపనకర్మసు స్యాత్కర్తోపవిష్టో దిశి దక్షిణస్యాం
సర్వేషు పర్వస్వపి చాగ్రతోంతః కుర్యాన్న చోర్ధ్వం నియమో థకించ

కామ్యవ్రతోద్యాపనములయందు, సమస్త పర్వములయందు, కర్త దక్షిణ భాగంబున కూర్చుండి సంకల్పములు జేసి తనవెడమప్రక్కన పత్నిని ఉంచుకొనవలెను.

హిరణ్యకేశివ్యతిరిక్తశాఖానాం ప్రధానహోమాదిషు సర్వనిత్యం
శాఖావిభేదాత్తు వనంశయోః తతిత్షే ద్వధూర్దక్షిణతో వరస్య ॥౨౦॥

హిరణ్యకేశులుగాక మిగిలిన సమస్తశాఖలవారు ప్రధాన హోమాది అయుకర్మలను దక్షిణవధువుగానుండి చేయవలెను.

ఇత్యుక్తమార్గైర్బహుభిస్స్వవృద్ధైః సూత్రార్థతాత్పర్యవివేకవద్భిః
సంకల్పమారభ్యసమాపనాంతం కర్త్రైవ నేమం సకలం క్రియాసు ॥౯౧॥

సూత్రార్థ తాత్పర్య వివేకము కలిగినట్టియు, వృద్ధులైనట్టియు, అగు పెక్కుమంది పెద్దలచే నీప్రకారముగా చెప్పబడినందున సంకల్ప ప్రభృతి సమాప్తి పర్యంతము పత్నికుత్తరమున నాసీనుడై కర్త సమస్త కర్మలు చేయవలెను.

## ప్రధాన హోమము

శుభోపవిష్టస్స్వవరేణ పావకం స్వదక్షిణాసీనవధూముపస్పృశన్ వ
రో యతాసుస్స్వనయానవోఢయావధ్వాసహాత్రైవివాహహోమకం
కరిష్య ఇత్యూర్జ్య తతోగ్నిమిధ్వాత్వాద్యాజ్యభాగాంత ఇహోదితమగ్న్యాఖ్యాం
నుసంస్పృశన్వై హృదయం చ వధ్వాః సిష్టస్వాన్తామభిమంత్రయేత ॥౯౨॥

వరుడు అగ్నికి పశ్చిమ భాగంబున సుఖాసీనుడై తనకు దక్షిణ భాగంబున నాసీనయగు వధువును స్పృశించుచు ప్రాణాయామము చేసి "అనయా నవోఢయా వధ్వా సహ వివాహ ప్రధాన హోమం కరిష్యే" యని సంకల్పము చేసి అగ్నింధనాద్యాజ్యభాగాంతమునందు చేసి "సోమః ప్రథమో వివిదే, సోమోదదద్గంధర్వాయ" యనుఋగ్ద్వయముచే నాసీనురాలగు వధువు హృదయమును స్పృశించుచూ వధువునభిమంత్రించవలెను.

## పాణిగ్రహణము

మంత్రైః కన్యాదక్షిణోత్తానపాణిం సాంగుష్ఠం స్వకపాణినా దక్షిణేన
గృహ్ణీయాత్ త్రీన్ పుంస్ప్రజాః పుత్రకామో హ్యంగుష్ఠమంత్యేకం చాంగుళీః స్త్రీప్ర
జార్థీ ॥౯౩॥

స్త్రీ పురుష సంతానకాముడగు వరుడు తన వ్యాపారిత (బోర్లించబడిన) దక్షిణ హస్తముచే "గృహ్ణామి తే సుప్రజాస్త్వాయ" ఇత్యాది నాలుగు మంత్రములచే నుచ్చరించి మంత్రాంతమునందు, సాంగుష్ఠము, బోర్లించబడినదియు, అగు వధూదక్షిణహస్తము గ్రహించవలెను. కేవల పుత్రకాముడగు వరుడు బొటనవ్రేలిని మాత్రమే గ్రహించవలెను. కేవల స్త్రీ సంతానము కోరునతడు అంగుష్ఠము గాక మిగిలిన వ్రేళ్లను పట్టుకొనవలెను.

## సప్తపది

అథోత్తరేణాగ్నిమిమాం వధూం తు ప్రాచీం దిశం వాప్యథవాప్యుదీచీం

రక్షింపవలెను. (శ్రమవలనగాని ప్రమాదము వలనగాని సాయంప్రాతః కాలౌపాసనము లయందు విచ్ఛిన్నమైనయెడల విచ్ఛిన్నౌపాసనాగ్ని పునస్సంధానముచేసి హోమకాలము పర్యంతముదంపతులలో నొకరు ఉపవసించి యుండవలెను.

యజమానే ప్రవసతి సత్యగ్నిస్థాపనాదికం
కారయిత్వా తదారభ్య పత్నీ తూపవసేదితి॥ ౨౦౭

అదిమొదలుకొని భర్త ప్రవాసము వెళ్లినప్పుడు అగ్ని విచ్ఛిన్నమైనచో విచ్ఛిన్నాగ్నిపునస్సంధానము చేయించి తదారభ్య భర్త వచ్చువరకు పత్ని ఉపవసించి యుండవలెను.

రోగోపవాసాతురసంకటాదిషు త్వయాశ్చేతు వ్యాహృతిభిస్స్రువాహుతిః
హుత్వాన్నమద్యాద్యది సాయమహ్నా వా ధోవిశ్య మానాగ్నిరపి ప్రమాదతః॥ ౨౦౮॥ భ్రమాచ్చతూరాత్ర మహూయమానోగ్నిర్లౌకికస్స్యాత్ప్రతిపద్యతే ఫ అపస్తరాత్రాజ్జుహుయాదిహైతే వనస్పతిం చ ప్రతిహోమమేకే॥ ౨౦౯॥ ఆద్వాదశాహాదితి కేచిదాహుః పునశ్చ సంధిస్తదతిక్రమేతు అతిక్రమే ద్వాదశవాసరే పునస్సంధానముక్తం స్మృతికృద్భిరుక్తమ్॥ ౨౧౦॥

సాయంప్రాతః కాలముల యందు రోగము, ఉపవాసము, ఆపద మొదలగునవి తటస్థించినయెడల ఔపాసనము చేయలేక పోయినచో "అయాశ్చ" యను మంత్రముచేతను వ్యాహృతులచేతను స్రువాహుతిని చేసి భుజించవలెను. మరియు ప్రమాదమువలనగాని భ్రమవలనగాని అగ్ని విచ్ఛిన్నము గాకపోయినను నాలుగు రాత్రులు ఔపాసనము చేయనిచో ఆ అగ్ని లౌకికమగును. సప్తరాత్రముల వఱకు ఔపాసనము చేయనిచో లౌకిక మగుననియు, తద్దోష పరిహారార్థమై వనస్పతి హోమము జేయవలయునని యొకొందఱు చెప్పుచున్నారు. ద్వాదశ రాత్రములు ఔపాసనము చేయనిచో లౌకికమగునని కొందఱు చెప్పుచున్నారు. ద్వాదశ రాత్రాతిక్రమమైన యెడల పునస్సంధానము చేయవలయునని స్మృతికర్తలు చెప్పుచున్నారు.

అథోత్తరం సూత్రముహోత్తరారధస్యోత్తం భనీత్యా వదన ప్రవేశాత్
ప్రయాణకార్యం యదృదాదిహోమకం ధర్మ్యం విహాయైవ మనీషిణోఖిలాః
ప్రధానహోమే సతి తత్సమాప్తౌ గృహప్రవేశార్థమిహ ప్రయాణం
ఉక్తం విసృజ్యాథుని కాశ్చ తత్ర కుర్వంతి తత్కర్తురనుజ్ఞయైవ॥ ౨౧౧

స్మృత్యుక్తమ్మస్త్రంత్రితభస్మధారణంకర్తవ్యమిత్యుక్తమిదంమనీషిభిః।
ప్రాతస్తుసర్వంహిసమానముచ్యతేసేష్టాత్రసౌర్యైకథమాహుతిః క్వచిత్

స్థాలీపాకానంతరము రాత్రి ప్రథమ యామమునందు ఔపాసనము ప్రారంభించవలెను. సాయంప్రాతరౌపాసనములయందు అగ్నియు, అగ్నిస్స్విష్టకృత్తును దేవతలు "స్థాలీపాకవద్దైవతం" ఆప-గృ ౭-౨౦। అనుటవలన స్థాలీపాక దేవతలు ఆ యుద్దేశ్యె "సౌర్యప్రాతరాహుతిః ప్రాతరిత్యేకే" ఆప-గృ-౭-౨౧। అనుసూత్రానుసారము ప్రాతరౌపాసనమందు "సూర్యాయస్వాహా" యనికొందరు చెప్పుచున్నారు. అదిఆపస్తంబసమ్మతముకాదు ఔపాసనాదిసర్వహోమములయందు ఆద్యంతములయందు పరిషేచనము చేయవలెను. అగ్నిమధ్యమందు "అగ్నయేస్వాహా" యనియు, ఈశాన్యదిక్కునందు "అగ్నయేస్విష్టకృతేస్వాహా" అనియు, సాయంప్రాతః కాలములయందు తండులములతోగాని, యవలతోగాని, ఋషితీర్థముతో ఆహుతిద్వయము చేయవలెను. అనంతరము "అగ్నేత్వంనో అంతమః" యనుమంత్రములతో అగ్న్యుపస్థానము చేసి, అనాజ్ఞాతత్రయమంత్ర జపమును చేయవలెను. అంతము స్మృతులయందు చెప్పబడినదియు ఋషులచే మంత్రితమైనదియు, అగుభస్మధారణమవలయునని విద్వాంసులు చెప్పుచున్నారు. సాయంప్రాతరౌపాసనములకు భేదములేదు. ప్రాతః కాలంబున సౌర్యాహుతి ఆపస్తంబ సమ్మతముగాదు.

## ఔపాసనకాలము

ప్రాతః ప్రాతర్హోమకాలస్తుముఖ్యః కాలోగౌణస్సంగవాంతోథసాయం॥
ముఖ్యః కాలోద్వాముహూర్తౌ ఽతదూర్ధ్వంగౌణః కాలః ప్రాహురేవంమునీంద్రాః। ౨౩౨ ప్రదోషాంతో హోమకాలస్సంగవాంతః
ప్రాతరేవ।ఆశ్వలాయనఆచార్యోభగవానుక్తవాన్కిల॥ ౨౩౩।

ప్రాతరౌపాసనమునకు ప్రాతఃకాలము(పంచధా భాగించబడిన దివసముయొక్క ప్రథమభాగము) ముఖ్యకాలము సంగవకాలము గౌణ పక్షము. సాయమౌపాసనమునకు సూర్యాస్తమయానంతరము రెండు ముహూర్తములు ముఖ్యములు అటు తర్వాత గౌణము అని మునీంద్రులుచెప్పుచున్నారు. సాయమౌపాసనమునకు ప్రదోషాంతము వరకు సమయమనియు, ప్రాతరౌపాసనమునకు సంగవాంతము వరకు కాలమనియు, ఆశ్వలాయనాచార్యుడు చెప్పియున్నాడు.

హోమావశిష్టంచరుమాజ్యసంప్లుతంతం బ్రాహ్మణం దక్షిణదిక్స్థితం।సంభోజయిత్వావృషభంవధూరుపాధ్యాయమాయతస్యాపచితా

యాధీమతే॥౨౩౪॥

పితుః కులాదాహృతమత్ర దద్యాత్తద్దక్షిణార్థం భవతి క్రియాంగం। స్యాద్యత్ర యత్రాపచితాఖ్యశబ్దస్తత్రాప్యుపాధ్యాయ ఇతీరితోఽర్థాత్॥౨౩౫॥

హోమావశిష్టచరువును ఘృతప్లుతముజేసి దక్షిణదిక్కునందున్న బ్రాహ్మణుని భుజింపజేయవలెను. పితృగృహమునుండి తీసుకురాబడిన వృషభమును క్రియాంగమగు దక్షిణగా నపచితుడగు ఉపాధ్యాయునికివ్వవలెను. ఎచ్చట నపచిత శబ్దము చెప్పబడినను ఆశబ్దమునకు ఉపాధ్యాయుడని అర్థము.

స్థాలీపాకప్రకరణమిహోక్తంహికాంతావత్రైనా మాగ్నేయేనప్రభృతి
కథితంకార్యమాగ్నేయసంజ్ఞం। స్థాలీపాకాభిధమ్వృషభదానాంతిమ
త్రైవసాయంప్రాతశ్చౌపాసనవిధిమపిప్రోక్తవానాత్మశుద్ధ్యై॥౨౩౬॥

‘‘అగ్నైనామాగ్నేయేన స్థాలీపాకేనయాజయతి,, ఆప-గృ-౭-౧॥ అనునది మొదలుకొని సమాప్తివఱకు స్థాలీపాకప్రకరణమును వ్యాఖ్యానించబడుచున్నది. వృషభదక్షిణంబగు ఆగ్నేయ స్థాలీపాకమును, సాయంప్రాతఃకాలములయందౌపాసనమును, ఆత్మశుద్ధికొఱకు చేయవలయునని ఈప్రకరణమునందే ఆపస్తంబ మహర్షి చెప్పియున్నాడు.

తత్రైవంహ్యా ఊర్ధ్వమాదిమనుసృత్యాదక్షిణేత్యేక ఇ
త్యంతంపార్వణపూర్వకాలవిహితాన్వారంభణీయేనసహ।
* సాకంసాంగతయోపపాదితమిమంతద్దర్శపూర్ణాఖ్యమా
స్థాలీపాకవిధింప్రతిప్రతిపదంకర్తవ్యమాజీవితం ॥౨౩౭॥

ఆ స్థాలీపాకప్రకరణమునందే ‘‘ఏవమతఊర్ధ్వగ్ం దక్షిణావర్జము పాపితాభ్యాంపర్వసు కార్యః,, ఆప-గృ-౭-౧౭॥ ఇత్యాది ‘‘పూర్ణపాత్రస్తు దక్షిణేత్యేకే,, ఆప-గృ-౭-౧౮, ఇత్యంత గ్రంథముచే ప్రతి పత్స్థాలీపాక పూర్వకాల కర్తవ్యాన్వారంభణీయ స్థాలీపాక సహితముగాను సాంగముగాను ప్రతిపాదించబడినదియూ, దర్శపూర్ణమాసనామముగలదియూ, అగు ప్రతిపత్స్థాలీపాకమును ప్రతి ప్రతిపత్తు(పాడ్యమి)నందును యావజ్జీవము చేయవలెను.

ప్రతిపత్స్థాలీపాకారంభకాలము

అతఊర్ధ్వమిహాగ్నేయస్థాలీపాకాత్పరంహ్యాతః।
ఊర్ధ్వమన్వారంభణీయచరోరూర్ధ్వమితీరితం ॥౨౩౮॥

* సార్ధమితి పాఠాంతరం.

ప్రస్తావేస్మిన్నేతదుక్తం భవత్యాచారాపేతో యస్యాస్తి తస్యాధికారః॥

ఎవ్వనికి ప్రత్యాబ్దిక దర్శశ్రాద్ధములను జేయవలసిన యావశ్యకత లేదో అతడు ప్రవసేత్ "ఉపోషితాభ్యాం" ఆప.గృ-౭-౧౭॥ అనుసూత్రార్థము నిశ్చయముగ నుదాహరింపబడినది. పూర్వోక్త ప్రస్తావనయందు ఎవనికి ఆచారాపేతుగలదో వానికే అధికారమని చెప్పబడినట్లున్నది.

## అన్వారంభణీయస్థాలీపాక కాలము

స్థాలీపాకానంతరం చేద్వివాహే సంపూర్ణే యామయాతి చేత్పౌర్ణమాసీ
తస్యామన్వారంభణీయాఖ్యో హోమం కుర్యాత్ప్రాతః పౌర్ణమా
స్యాం యథోక్తం॥ ౨౬౦

వివాహసమాప్తిగానే వెంటనే పూర్ణిమ వచ్చినచో ఆపూర్ణిమా ప్రాతః కాలంబున అన్వారంభణీయస్థాలీపాకము జేయవలెను.

## అన్వారంభణీయస్థాలీపాక దేవతానిర్ణయము

శ్రౌతేన్వారంభణీయాయామగ్నావిష్ణూ సరస్వతీ।
సరస్వాంశ్చాగ్నిభగినో స్మార్తే ప్యేతాశ్చ దేవతాః॥ ౨౬౧॥
అగ్నిస్స్విష్టకృతం చాంతరేణేత్యస్మాచ్చ సూత్రతః।
ఆద్యోగ్నిస్స్విష్టకృచ్చాంతే నక్వేషు చరుకర్మసు॥ ౨౬౨॥
తస్మాదన్వారంభణీయ చరావష్టదేవతా ఇతి।
కారికాకృద్భిరత్రోక్తం గృహ్యావిద్భిః పురాతనైః ॥ ౨౬౩॥

శ్రౌతాన్వారంభణీయస్థాలీపాకమునందు "అగ్నావిష్ణూ, సరస్వతీ, సరస్వాన్, అగ్నిభగినా" యని యే దేవతలుగలరో స్మార్తాన్వారంభణీయయందును ఆదేవతలే॥ "అగ్నిం స్విష్టకృతంచాంతరేణ" ఆప-గృ-౭-౨౯॥ అనుసూత్రమువలన సమస్తమను ప్రధానకర్మములయందు ముందుగా అగ్నియును నంతమునందు అగ్నిస్విష్టకృత్తును విధించుచున్నారు అందువలన అన్వారంభణీయస్థాలీపాకమునందు ఆఱుగురు దేవతలని ప్రాచీనులు గృహ్యవేత్తలు అగు కారికాకారులు చెప్పియున్నారు.

అనాహితాగ్నేః ప్రథమే చరౌ చ తస్యాపి కాలః కిల పౌర్ణమాస్యాం।

అనాహితాగ్ని యగు వానికిని పూర్ణిమయందే ప్రాతః కాలమున అన్వారంభణీయ స్థాలీపాకము విధించబడినది అని కపర్దిశిష్యులు చెప్పుచున్నారు.

## అన్వారంభణీయస్థాలీపాకము

ప్రాతర్వాదంత్యేవక పర్ది శిష్యాఅగ్ని స్తథాగ్నా పహితశ్చవిష్ణుః॥ ౨౫౪॥
సరస్వతీచైవతథానరస్వాన్ అగ్ని భగాగీస్విష్టకృదగ్ని రేతాః।
క్రమేణహుత్వాఘతః జయాదీననంతరం బ్రహ్మావిసర్జనంచ॥ ౨౫౫

అగ్న్యాది స్విష్టకృదంతపదాహుతులను క్రమముగాహోమముజేసి అనంతరముజయాది బ్రహ్మావిసర్జనము వఱకు చేయవలెను.

ఆద్యే చరౌ దక్షిణతో వరో త్రా వదానధర్మా జ్జుహుయాత్తు
ధీమాన్। క్రమేణ చాగ్న్యాది చతస్ర ఆహుతీ హుత్వా గ్నయే
నై త్ర భగినే వదాయ॥౨౫౬। శిష్టం హవిః ప్రత్యభిఘార్య ప
శ్చా ద్ధోమ స్తత స్విష్టకృతే వదాయ। సంస్థాప్య దర్వించ జ
యాదికాంతే యదస్యతు స్విష్టకృతం చహుత్వా॥౨౫౭। సమం
జనం బర్హిష ఏవ శమ్యాః పరేహ్ని తత్ప్రతిహోమఉక్తః।

అన్వారంభణీయస్థాలీపాకమునందు దక్షిణాగ్రుడుగా నుండవలెను. హవిస్సును అవదానధర్మముగా గ్రహించి అగ్న్యాదిచతుర్హోమములను జేసి ఐదవ ఆహుతియగు అగ్ని భగినికి అవదానము జేసి "అంతే ప్రత్యభిఘార" యనువచనమునలన చరుశేషమును ప్రత్యభిఘరించి తర్వాత హోమముజేయవలెను. అనంతరము స్విష్టకృత్తునకు అవదానము జేసిన దర్వినొకవోనుంచి జయాదిహోమాంతమునందు "యదస్యకర్మణః" యనుమంత్రముచే స్విష్టకృద్ధోమము జేయవలెను. ప్రాయశ్చిత్తహోమాది బ్రహ్మవిసర్జనాంతమందు బర్హిస్సనుంజనము జేయావలెను. అన్వారంభణీయ యందు శమ్యలు వేయవలెను. పరదినము (పాడ్యమి) న ప్రతిపత్స్థాలీపాకము జేయవలెను.

సతీషు బహీష్వష్వ శనాహుతీషు ప్రాప్తాస్వ వత్తం త్వభిఘార్య
చాంతం॥౨౫౮। శిష్టం హవి స్విష్టకృదర్థ మేవా భిఘారయేత్ప
ర్వాసు చక్రియాసు।

అనేక చరుహోమములుగల కర్మలయందు ఆఖరు ఆహుతికిఅవదానము జేసి అభిఘరించి శిష్టహవిస్సును స్విష్టకృదర్థమై అభిఘరించవలెను.

ఉక్త స్థాలీపాకధర్మ స్తుయావాం స్తావాం త్సర్వాః పార్వణేతూ
పదిష్టః॥౨౫౯॥ భేద శ్చే త్తద్దక్షిణావర్జ మత్ర కేచిత్ప్రాహుః పూ
ర్ణపాత్రం త్విరిస్యాత్॥౨౬౦

ఆగ్నేయస్థాలీపాకధర్మము లన్నియు ప్రతిపత్స్థాలీపాకమునందు గ్రాహ్యములు ఈస్థాలీపాకములయందు దక్షిణ నిచ్చుట, దక్షిణ నివ్వకపోవుట, యను భేదము గాక మరే భేదమును లేదు. ప్రతిపత్స్థాలీపాకమునందు పూర్ణపాత్రమును దక్షిణగా నియ్య వలయునని కొందఱు చెప్పియున్నారు.

హిరణ్యకేశిప్రముఖాః పూర్ణపాత్రం తుదక్షిణా।

ఇత్యాహు ర్దర్శపూర్ణేతు స్థాలీపాకాఖ్యకర్మణి॥౨౬౧।

హిరణ్యకేశి మొదలగు వారు ప్రతిపత్స్థాలీపాకములయందు పూర్ణపాత్రమును దక్షిణగా నీయవలయునని చెప్పుచున్నారు.

తత్రాపితఊర్ధ్వ మిత్యా ద్యాపూర్ణపాత్రంతుదక్షిణా,

ఇత్యేకపక్ష ఇత్యేత త్సూత్రార్థ స్సము దాహృతః॥౨౬౨

“ఏవమత ఊర్ధ్వం” ఆప-గృ-౭-౧౮- ఇత్యాది పూర్ణపాత్రస్తుదక్షిణేత్యేకే” ఆప-గృ-౭-౧౮- ఇత్యంతమగు సూత్రార్థ మిట్లు స్పష్టముగా చెప్పబడినది.

నిత్యప్రాయశ్చిత్తనైమిత్తికాని కామ్యా న్యపైతాని నైపార్వ ణేన।వ్యాఖ్యాతా న్యన్యాని కర్మాణి తాని సాధ్వాచారం ద్వా నిగృహ్యాంతరఉక్తం॥౨౬౩।

ఏ కర్మములు సాధ్వాచారము వలన గ్రహింపబడుచున్నవో అట్టినిత్యనైమిత్తికకామ్య ప్రాయశ్చిత్తాది సమస్తకర్మలయందు ఆగ్నేయస్థాలీపాకధర్మములు అతిదేశము చేయబడినవి.

హృదయసంసర్గాదికర్మలయందు దేవతానిర్ణయము.

హృత్సంసర్గా గ్రయణే శాన సర్ప మాసి శ్రాద్ధా ష్టకాద్యేషు షట్సు। కర్మస్వా చార్యేణ చైతేషు తత్రతత్రా భీష్టా దేవతా శ్చోపదిష్టాః।౨౬౪।

హృదయసంసర్గము, ఆగ్రయణము, ఈశానబలి, సర్పబలి, మాసిశ్రాద్ధము, అష్టకాశ్రాద్ధము అను ఆఱుకర్మలయందు ఆచార్యునిచేతనే దేవతలు చెప్పబడిరి.

స్థాలీపాకే దేవతా వైశ్వదేవే విశ్వేదేవా ఇత్యనేనోపదిష్టాః। మంత్రామ్నాయానుక్రమేణైవ చాగ్నా ద్యాద్యాద్రాంతాదే వతాస్త్రింశదుక్తాః।౨౬౫।।

వైశ్వదేవస్థాలీపాకమునందు “వైశ్వదేవేవిశ్వేదేవాః” ఆప-గృ-౭-౨౭॥ అను

సూత్రముచే మంత్రప్రశ్నము నందలి ఆమ్నాయానుసారముగానే అగ్న్యాది రాద్ధాంతంబులకు ముప్పదిముగ్గురు దేవతలు చెప్పబడిరి.

సర్పోత్సర్గే దేవతా పౌర్ణమాసీ కర్మణ్యా స్త్వాగ్రావణే మార్గశీర్షే। తత్రా ష్యన్వారంభణీయే చరౌ చశ్రౌతోక్తా యా దేవతా స్తా ఇహాస్యుః॥ ౨౬౬।

శ్రావణ మార్గశిర మాసములయందు చేయబడు సర్పబల్యుత్సర్గములయందు తత్తన్మాసపూర్ణిమలే దేవతలు. స్మార్తాన్వారంభణీయస్థాలీపాకమునందు శ్రౌతాన్వారంభణీయ దేవతలనే గ్రహించవలెను.

ధర్మప్రశ్నోక్తే మహారాజసంజ్ఞే చరౌ చస్థాలీపాకే దేవతాస్యాత్సఏవ। ఉక్తోత్సర్గే శ్యత్రహోమే గణాఖ్యే ప్రోక్తా మంత్రాస్సత్రే బోధాయనేన। ౨౬౭।

ధర్మప్రశ్నమునందు చెప్పబడిన మహారాజచరువునందును, స్థాలీపాకమునందును, మహారాజే దేవత వృషోత్సర్జనమునందు, గణహోమమునందు, బోధాయనునిచేమంత్రములు చెప్పబడినవి.

ప్రాయశ్చిత్తేషు వ్రతోద్యాపనేషు కామ్యేషూగ్రర్క్ష ప్రసూతౌ చసత్యాం। శాంతిష్వాదిత్యాదియజ్ఞేషు మంత్రాస్తే నైవోక్తా దేవతా స్స్యు స్స్మృతౌ చ। ౨౬౮।

ప్రాయశ్చిత్తములయందు, కామ్యవ్రతోద్యాపనములయందు, ఉగ్రనక్షత్రజననాది శాంతులయందు, ఆదిత్యాది గ్రహయజ్ఞములయందు, మంత్రములు, దేవతలు, బోధాయనునిచే చెప్పబడిరి.

## ముఖాహుతినిర్ణయము

స్థాలీపాకా స్సంతి యేతే చసర్వే కార్యా ఏవం పార్వణే నోపదిష్టాః॥ యాయా స్థాలీపాకహోమేషు చోపదిష్టాస్తాసాం దేవతానాంపురస్తాత్। ౨౬౯। స్థాలీపాకా చ్చావదాయా వదానధర్మేణా దాయాగ్నయే గ్రేచ హుయాత్। అత్రోక్తాభ్యో దేవతాభ్యశ్చహుత్వాతాసామంతేస్విష్టకృద్ధోమఏవ। ౨౭౦॥ అగ్నిస్విష్టకృతంచాంతరేణేతి సూత్రస్యాభిప్రాయ మేవం వదంతి।

సమస్తస్థాలీపాకములు పూర్వోక్త ప్రకారముగా చేయవలయునని వివాహస్థాలీపాకముచే వ్యాఖ్యానము చేయబడినది. (అనగా ఆగ్నేయస్థాలీపాక ధర్మములు ప్రతిపత్స్థాలీపాకాదులయందు చెప్పబడినవి) స్థాలీపాకదేవతాహోమములకంటె ముందుగా నవదానధర్మముచే హవిస్సును గ్రహించి "అగ్నయేస్వాహా" యనిముఖాహుతి జేయవలెను. అనంతరము కర్మోక్త దేవతాహోమముల జేసి సర్వాహుత్యంతమందు స్విష్టకృద్ధోమముజేయవలెను. అనిఅగ్నిగ్స్విష్టకృతంచాంతరేణ''యనుసూత్రాభిప్రాయము విద్వాంసులు చెప్పియున్నారు.

అగ్నిశ్చాగ్నిస్స్విష్టకృచ్చ ప్రధానౌ స్థాలీపాకే పార్వణేపి
ప్రధానౌ.౨౭౧। ఏతావన్యోన్యాశ్రయౌ చానపాయావన్యేషాం చాద్యన్తయోర్హి ప్రధానౌ। ఇత్థం సిద్ధప్రోక్తమగ్నిం
వికల్ప్య ముక్త్వా స్వాభిః క్వాపి సంపాదితో
గ్నిః।౨౭౨। ఇత్యేవాహు స్స్విష్టకృన్న ప్రధానం నాంగం కింతద్ధోమశేషోపపత్తిః। ఏ
వం బ్రూయు శ్శుష్కమీమాంసకా యే తేషాం ప్రవ్యక్తో ప్రలా
పో హి పక్షః।౨౭౩।

పార్వణస్థాలీపాకమునందును, అగ్నియు, అగ్నిస్విష్టకృత్తును, ప్రధానములు. ఈ రెండును అన్యోన్యాశ్రయముగలవి, ఒకదానిని విడచి మఱొకటి యుండదు. ఇతరహోమముల యాద్యంతములయందు చేయబడుచున్నవి. ఇట్లు సిద్ధించిన అగ్నిని విడచి మనకు అగ్ని ఎట్లువచ్చెనదనియు, స్విష్టకృద్ధోము ప్రధానము అంగముగూడ కాదనియు, అయ్యాది హోమశేష ప్రయోజనమనియు, చెప్పుచున్న శుష్కమీమాంసక మతము ప్రత్యక్ష ప్రలాపము. (యథార్థము గానిది)

శుష్కమీమాంసలక్షణము

శ్రౌత స్మార్త ప్రక్రియానీక్షమాణా శ్శాస్త్రాధీతా శుష్కమీ
మాంసకాస్తే।

శ్రౌతస్మార్త ప్రయోగ జ్ఞానములేని కేవలశాస్త్రవేత్తలు శుష్కమీమాంసకులని చెప్పబడుదురు.

ఆచార్యైర్హ్యుదితం సూత్ర మేతత్కర్మానుష్ఠానక్రమం తద్వి
కల్ప్య।౨౭౪। కుర్వంతి వ్యాఖ్యాన మాత్రాన్యథా హి వ్యాఖ్యా
తారః కేచి దుచ్ఛృంఖలేన।

కర్మానుష్ఠానక్రమ బోధకంబును, ఆచార్య ప్రోక్తంబును, అగుసూత్రమును విశల్పించి కొందరు వ్యాఖ్యాతలు స్వేచ్ఛగా అన్యథా వ్యాఖ్యానము జేయుచున్నారు

అప్రాతిరిక్తం భవతి క్రియా సదా హ్యనుష్ఠితా స్వసంప్రతిస్వ
హ్యావేదిభిః॥ ౬౭॥ ఏతావదా చార్యహృదాశయం మతం సూ
త్రార్థతాత్పర్యమితి స్ఫుటం న్విదమ్॥

• ఈవిషయమై ఇట్లు చెప్పబడుచున్నది ఇప్పుడు గృహ్యాక్తులు సమస్తకర్మలు జేయుచున్నారు. ఆచార్యహృదయము ఇదియు. సూత్రార్థతాత్పర్యము ఇట్లు స్పష్టముగా చెప్పబడినది.

అగ్ని శ్చాగ్నీషోమౌ స్విష్టకృ ద్దేవతే చాగ్నేయస్థాలీపాక ఏవాధతే ద్వే॥
స్థాలీపాకే పార్వణే తు ప్రధానే సంగచ్ఛేతే దేవతే చాధతే ద్వే।
ఉచ్యేతే చాద్యన్తయోస్తు ప్రధానే స్థాలీపాకే ష్వేవ సర్వేషు
తస్మాత్॥ ౬౮॥ అదా వగ్నిః పార్వణే నోపదిష్టస్థాలీపాకేషూ
దితా దేవతాయాః। తాసామంతేస్విష్టకృద్దేవతానాం స్థాలీపా
కేషూచ్యతే హి క్రమోయం॥ ౬౯॥ ఏవం సిద్ధే నన్వపి ప్రా
హు రాజ్యేనా చారాచ్చా గ్రే గ్నయే హోమ మేకే। త
త్కర్తవ్యం న్వోపదేశాతిదేశాభావాదాజ్యేనైవ హోమోనయు
క్తః ॥ ౭౦॥ తస్మా దేవాగ్నిప్రధానే ష్టకృద్భ్యస్థాలీపాకాన్నే
న హోతవ్య మేవ॥ ౭౧॥

ఆగ్నేయస్థాలీపాకమునందగ్నియు,అగ్నిస్విష్టకృత్తును ప్రధానదేవతలు. ఆయిద్దఱే పార్వణస్థాలీపాకమునందుకూడ ప్రధానులు. ఆకారణమువలన సమస్తస్థాలీపాకముల యందు ఆద్యంతములయందు ప్రధానదేవతలుగా చెప్పబడుచున్నారు పార్వణస్థాలీపాకమునందు చెప్పబడిన దేవతాహోమాత్పూర్వము అగ్నియు, తర్వాత తత్తత్కర్మోక్త ప్రధాన దేవతా హోమములను, అంతము నందు స్విష్టకృద్ధోమమును చేయవలయును అని క్రమముండగా కొందఱు ముందుగా నాజ్యముచే "అగ్నయే స్వాహా" యని హోమము జేయవలయునని చెప్పుచున్నారు. అట్లుచేయవలయునని ఉపదేశాతిదేశములు లేకపోవుటవలన ఆజ్యహోమము జేయకూడదు. అందువలనఅగ్నికి,ప్రధానదేవతలకు, స్విష్టకృత్తునకు, స్థాలీపాకచరువుచేతనే హోమము జేయవలెను.

ఏకం హవి శ్చాగ్నిముఖాహుతి ప్రధానాహుతి స్విష్టకృదాహు

తీనాం। త్రేధా ప్రధానీకృత దేవతానాం సాధారణత్వాద్ధవిషో
పృథ క్త్వం॥౨౪౧।

అగ్నిముఖాహుతి ప్రధానాహుతి స్విష్టకృదాహుతులకు హవిస్సు ఒక్కటే. అగ్ని, ప్రధాన దేవతలు, స్విష్టకృత్తు, సమానులగుటవలన హవిస్సు వేఱువేఱుగా చేయ నక్కఱలేదు.

క ర్తవ్యా నుష్ఠాన యోగ్యాః పదార్థా గూఢభూతా స్సంతి యే
యత్ర తత్ర। యత్రాస్మాకం జాయతే సంశయ స్తద్భూయో
భూయః ప్రాయశ స్సంస్మరామః॥ ౨౪౨।

కర్మలయందనుష్ఠానయోగ్యములగు పదార్థములు గూఢముగా నెచ్చటెచ్చట నుండునో ఎచ్చటెచ్చట మాకుసందేహములు కలుగుచుండునో అచ్చటచ్చట ఆయాయీపదార్థములను తరుచుగా మేము స్మరించుచుందుము.

ముఖాహుతి స్స్యాచ్చరుణా తదాదౌ కార్యా ప్రధానాహుత
యోపి మధ్యే॥ తదంతి మే స్విష్టకృదేవహీ త్రిప్రాహు రృథా
గృహ్యావిదో విధిజ్ఞాః॥౨౪౩॥

ముందుగా ముఖాహుతియు, మధ్యను ప్రధానాహుతులును అంతమందు స్విష్టకృదాహుతిని, జేయవలెనని గృహ్యాదులగు పండితులు చెప్పుచున్నారు.

చరుప్రధానే ష్వఖిలేషు కర్మసు ప్రాధానకత్వా చ్చరుణాముఖా
హుతిః॥ ఉత్సర్జనోపాకరణ వ్రతేషు ఘృతేన కార్యా గ్నిము ఖా
హుతి స్స్యాత్। ౨౪౪.

చరుప్రధానములగు సమస్తకర్మలయందు చరువుచేతను, ఉత్సర్జనములు, ఉపాకర్మవేదవ్రతములు, మొదలగు ఆజ్యహావిష్కంబులగు కర్మలయందాజ్యము చేతనుముఖాహుతిని జేయవలెను.

అగ్నిప్రధానౌషధికర్మణికద్వచిన్ముఖాహుతిర్నా స్త్యథచాస్తి కేషుచిత్
।హావ్యేనచాగ్నివ్యతిరిక్తదేవతా ప్రధానకర్మణ్యుదితాముఖాహుతిః।

అగ్ని ప్రధానంబులగు ఓషధిహావిష్కకర్మలయందు ముఖాహుతి లేదు కొన్నికర్మలయందు ముఖాహుతిగలదు. అగ్నితరదేవతాప్రధానంబులగు కర్మలయందు హావిస్సుచే ముఖాహుతి జేయవలెను.

అథా వికృత మాతిథ్యం మధుపర్కార్పణే విధా। లద్వా పా

హోమమాత్రం స్యాత్తంత్రేపూర్వోత్తరే నచ॥ ౨౮౬॥

మధుపర్క పూజయందు యథాసూత్రముగా సవిధి పూజ చేయవలెను. పహోమ యందు అగ్నింధనాది పూర్వతంత్రము, జయాద్యుత్తరతంత్రములు లేవు.

మధుపర్కమున గోరాలంభ నిషేధము

కలౌ యుగే నిషిద్ధత్వాద్గోరాలంభస్య కర్మణః।
ఉత్సృష్టవ్యైవ గౌః స్త్రీత్ సర్వశాఖాసమంస్మృతిః॥ ౨౮౭॥

కలియుగమునందు గోరాలంభము (మధుపర్కమునందు గోవును వధించుట) నిషేధింపబడుటవలన గోవును విడువవలయుననుట సమస్తశాఖలకు సమ్మతము॥

ఆగ్నేయచరు మారభ్య యావత్ఖండసమాప్తితః
స్థాలీపాక ప్రకరణ మితిగృహ్యవిదాం మతం॥ ౨౮౮॥

ఆగ్నేయస్థాలీపాక ప్రభృతి ఖండసమాప్తి పర్యంతముగల గ్రంథము స్థాలీపాక ప్రకరణము అని గృహ్యవిదులకు సమ్మతము,

ఆరభ్య పార్వణేనాతోన్యాని కర్మాణి చేత్యతః।
ఖండాంత మేషాం సూత్రాణా మయమర్థ ఉదాహృతః॥

"పార్వణేనాతోన్యాని" ఆప-గృ-౭-౨౩- ఇత్యాది ఖండసమాప్తి పర్యంతము గల సూత్రములకు అర్థము చెప్పబడినది.

ఉపాకర్మయందు దేవతానిర్ణయము

యః కోపి చోపాకరణే సమాపనే ప్రజ్ఞాయతే ఋషి రిహాప్ర
ధానం। జాత్యేకవాక్యాదృషి రేవచషణ్ణాం హ్యాంగం త్వితీయం
సదసస్పతి స్స్యాత్॥ ౨౯౦

"ఉపాకరణే సమాపనే చ ఋషిర్యః ప్రజ్ఞాయతే" ఆప-గృ-౮-౧- ప్రజాపత్యాది కాండర్షులు ఉపాకర్మయందు ప్రధానదేవతలు అని తెలియవలెను. జాత్యేకవచనముగుటవలన ఋషియన ఋషులుఅని అర్థము. సదసస్పతి అంగదేవత.

సర్వేషు హోమేష్వపిచ ప్రధానం స్యాత్స్విష్టకృచ్చేత్యపి హోమసంజ్ఞే। ఇత్యుక్త మేవాగ్నిముఖే ప్రసంగా త్తాభ్యాంవినాక్వాపి నహోమ కర్మ॥ ౨౯౧

సమస్త హోమములయందు ప్రధానాహుతులనియు స్విష్టకృదాహుతియనియు రెండుహోమములుగలవు. అని అగ్నిముఖమునందు ప్రసంగమువలన చెప్పబడినది. ప్ర

ధాన స్విష్టకృదాహుతులు వినాగా హోమముండదు.

తస్మాత్ప్రధానం హిస్తవర్జయో క్రతాస్యస్విష్టకృతాస్య త్స
దసస్పతిర్హి। వ్రతేషు చోపాకరణే సమాపనే ప్యేవంహి కర్త
వ్య మనుక్రమేణ॥౫౫-౨॥

ఆ కారణమువలన సంస్థలు ప్రధానదేవతలు అనియు, సదసస్పతి స్విష్టకృత్స్థాన
నీయమనియు, దెలియవలెను. వ్రతములయందు, ఉపాకర్మమునందు, ఉత్సర్జనములయం
దు, ఇట్లు క్రమముగా జేయవలెను.

కర్తవ్యేస్మిన్నేతదుక్తం భవత్యాచార్యాధీనో యో వటు
స్తం ప్రతీదం। గర్భాజ్జాతాద్వాష్టమాబ్దోపనీతంత్రచ్ఛావణ్యాం
ప్రోష్ఠపద్యాం తువాపి॥౫౬-౩॥ అధ్యాయోపాకర్మ కృత్వా త
ఊర్ధ్వ మాగామిన్యాం ప్రావృషి ప్రారభేత॥ ప్రాజాపత్యా
ఖ్యవ్రతం హోమపూర్వం కార్యం వర్షం తద్వ్రతం చైక
మేవ॥౫౬-౪॥ పూర్ణేబ్దే స్యోత్సర్జనాఖ్యం చహోమం కార్యం
వర్షం తద్వ్రతం వర్షపూర్ణే। ఏవంసౌమ్యాఖ్య వ్రతాగ్నే
యవైశ్వదేవాని స్యుస్తత్తదుత్సర్జనాని॥౫౬-౫॥

ఏబ్రహ్మచారి ఆచార్యాధీనుడై యుండునో గర్భాష్టమవత్సరంబునగాని జన్మా
ష్టమాబ్దంబునగాని ఉపనీతుడగు ఆబ్రహ్మచారిని గురించి కర్తవ్యంబగు ఉపాకర్మ విష
యమై ఇట్లు చెప్పబడుచున్నది. శ్రావణమాసమునగాని, భాద్రపదమాసమునగాని, ఉపా
కర్మనుచేసి, తదనంతరం మాగామి శ్రావణమాసమున ప్రాజాపత్యవ్రతము హోమపూర్వక
ముగా ప్రారంభించి, ఒకసంవత్సరము వఱకు ఆవ్రతము నాచరించవలెను. వర్షపూర్తి
కాగానే ప్రాజాపత్య వ్రతోత్సర్జన హోమముజేసి, సంవత్సరపర్యంతము ఆఉత్సర్జన
ము నాచరించవలెను. ఇట్లు సౌమ్యవ్రతాగ్నేయ వ్రతవైశ్వదేవవ్రతములు తత్తదుత్సర్జ
నములు జేయవలెను.

ఏవం కర్తవ్యే సతి బ్రహ్మచర్య మష్టాబ్దం స్యాత్షోడశే జన్మ
నోధి। గోదానాఖ్యం కర్మ కార్యం హిసాంగే వేదే ధీతే స్యా
త్సమావర్తనాఖ్యం॥౫౬-౬॥

ఇట్లు నాలుగు వ్రతములు నాలుగు త్సర్జనములు చేసినట్లైతే ఎనిమిదివత్సర

అభ్యాసం కుర్వ న్నావహం వేద మేవ।
నశ్రావణ్యాం పౌర్ణమాస్యాం నశిష్యో
హోమం కృత్వోపక్రమే ద్వేదమూలం॥ ౩౧౫
ఇషేత్వేత్యాది చతురోనువాకానేవ నేతరాన్,
శిష్యా నధ్యాపయే దత్ర ధృతయజ్ఞోపవీతినః॥ ౩౧౬।
మాసా న్పంచా ధ్యాపనం పౌర్ణమాస్యాం రోహిణ్యాం
త్వోత్సర్జనాంతే ధ్యసేత్తు। వేదం శుక్లే కృష్ణపక్షేంగపాఠో
హ్యధ్యాయోపాకర్మ నామా హరేతత్॥ ౩౧౭,

శిష్యులకు వేదము చెప్పదలచినట్టియు, లేక ప్రతిదివసంబున వేదాభ్యాసము జేయదల చుకొన్నట్టియు, అతనాతడు శ్రావణపూర్ణిమ నాడు సశిష్యుడై హోమము జేసి వేద మూలమును ప్రారంభింపవలెను. ఈ ఉపాకర్మయందు "ఇషేత్వా" ఇత్యాది చతురనువా కములను శిష్యులకు చెప్పవలెను. గాని అంతకంటె అధికముగా చెప్పగూడదు. అనంతర ము ఐదుమాసములవరకు వేదము చెప్పవలెను. ఉత్సర్జనాంతమందైనను అభ్యసింపవలెను శుక్లపక్షమునందు వేదమును కృష్ణపక్షమునందు వేదాంగములనుజదువవలయును. దీని కి అధ్యాయోపాకర్మ యని పేరు.

యో బ్రహ్మయజ్ఞం క్రియమాణవిప్రః
పారాయణం వా సంహితాం కరిష్యన్।
హోమం చ కృత్వా గఛ్ఛేద్ యథార్థం।
పారాయణోపాకరణం తదేతత్॥ ౩౧౮।

బ్రహ్మయజ్ఞమును గాని, సంహితాపారాయణమును గాని, చేయదలచిన యాతడు హో మముజేసి, వేదమును ప్రారంభిన నది పారాయణోపాకర్మయని చెప్పబడుచున్నది.

హోమం కృత్వా కాండ మధ్యాపయే ద్యః
ప్రాజాపత్యం సౌమ్య మిత్యాదికాండాన్
కాండర్షిస్తైః పఠ్యతే ప్రాయశ స్త
త్కాండోపాకర్మేతి వృద్ధాః పఠంతి॥ ౩౧౯

ప్రతికాండమునకు హోమముజేసి ప్రాజాపత్యాది కాండము లెచ్చుట చెప్పబడు చున్నదో ఎప్పుడు కాండ ఋషులు తరచుగా చెప్పబడుచున్నదో దానికి కాండోపా

ర్మయని పేరు.

యస్య వ్రతస్య వ్రతదేవతాయా
నామ్నా తత శ్చోపనిషత్ప్రభృత్యః।
బ్రహ్మా స్వయంభూ స్సదసస్పతిశ్చ
పూజ్యా వ్రతోత్సర్జనయో శ్చహోమే॥ ౩౨౦॥
పంచైతా వ్రతనామ్న్యాదిదేవతా స్సదసస్పతిం।
సూక్తం జయాద్యాః ప్రాధాన్యం యస్యవై స్విష్టకృద్భవేత్॥

వ్రతదేవత, ఉపనిషత్తోయము, (యాజ్ఞికీరిత్యాది) స్వయంభువు, సదసస్పతి,అను దేవతలు వ్రతోత్సర్జనములయందు, హోమమునందు, బూజ్యులు పూర్వోక్తదేవతా పంచకము ప్రధానము సదసస్పతిని స్విష్టకృత్థానమునందు జేయవలెను. దీనికి వ్రతోహోమకర్మయని పేరు.

ఉత్సర్జనోపాకరణేషు కుర్యు రేవం మనీషిణః,
యజుర్వేదేతుచత్వారః కాండాః కాండవతీన్నృషీన్। ౩౨౧॥
తర్పయంత్య ర్చయంత్యేతానుపచారైస్తు సూరయః,
వ్రతేషూత్సర్జనేష్వేవంహోమంకుర్వంతిసంప్రతి॥ ౩౨౩॥

గృహ్యావిదులు ఉపాకర్మోత్సర్జనములయందు పూర్వోక్తప్రకారము గా జేయుచున్నారు. యజుర్వేదమునందు నాలుగు కాండములుగలవు. కాండపతులగు ఋషులకు షోడశోపచారములచే బూజించి తర్పణము జేయవలెను. వేదవ్రతములయందు, ఉత్సర్జనములయందు, ఇప్పటివారు హోమమును చేయుచున్నారు.

వేదవ్రతములు

ప్రజాపతేః కాండఋషేః పురస్తా
త్ప్రజాపతేనత్వదితీహ సూక్తం
ఆగ్నేయకే గ్నేనయసూక్త మానో
విశ్వేతి సూక్తం త్విహ వైశ్వదేవే ॥౩౨౪॥
సాంహితీభ్యో దేవతాభ్య ఉపనిషద్భ్యఏవచ।
యాజ్ఞికీభ్యో వారుణీభ్యో బ్రహ్మణే చస్వయంభువే ॥౩౨౫॥
సదసస్పతిమంత్రోక్త దేవతాయై తతః పరం।

జయాదయో ధస్విష్టకృత్తత్రోపస్థాన ముచ్యతే ॥౩౨౬॥
ఆగ్నేవ్రతపతే త్యాదిచతస్రో దేవతాః ప్రతి
తత్ర కాండఋషిభ్యః ప్రాజాపత్యవ్రత మాచరేత్ ॥౩౨౭॥
ఏవం సౌమ్యాగ్నేయవైశ్వదేవేష్వ నప జేదిహ।
ఏతచ్ఛాఖాంతరాయాతం మాభూ దాచార్యసంమతం ॥౩౨౮॥

ప్రాజాపత్యవ్రతమునందు పూర్వోక్తప్రకారముగా స్నానముజేసి, వస్త్రాలకు పూజాతర్పణములజేసి, అగ్నింధనాద్యగ్ని ముఖాహుత్యంతమందు, "ప్రజాపతయే కాండ ఋషయేస్వాహా" యని ముందుగా హోమముజేసి, "ప్రజాపతేనత్వదేతాన్" యను సూక్తముచే నాలు ప్రధానాహుతులజేసి, "సాగ్ హితీభ్యోదేవతాభ్య ఉపనిషద్భ్య స్స్వాహా, యాజ్ఞికీభ్యోదేవతాభ్య ఉపనిషద్భ్యస్స్వాహా, వారుణీభ్యోదేవతాభ్యఉప నిషద్భ్యస్స్వాహా, బ్రహ్మణేస్వయంభువేస్వాహా" అనిఉపహోమములను సదసస్ప తి మంత్రముచే "సదసస్పతిహోమమును జేయవలెను. ఆగ్నేయవ్రతమునందు అగ్నిము ఖాహుత్యంతమందు "అగ్నయే కాండఋషయేస్వాహా" యని ముందుగ హోమముజేసి

జయాద్యనంతరము స్విష్టకృద్ధోమమైన పిమ్మట "అగ్నేవ్రతపతే కాండఋషిభ్యః ప్రాజా పత్యవ్రతంచరిష్యామి తచ్ఛకేయంతన్మేరాధ్యతాం। వాయోవ్రతపతే, ఆదిత్యవ్రతపతే వ్రతానాంవ్రతపతే, అను మంత్రములచే అగ్న్యాదిదేవతాచతుష్టయోపస్థానము జేయవలె ను. ఆగ్నేయవ్రతమునందు, అగ్నిముఖాహుత్యంతమునందు "అగ్నయేకాండఋషయే స్వాహా" యనిహోమముజేసి "అగ్నేనయ" యను సూక్తముచే నాలు ప్రధాన హోమముల జేయవలెను. వైశ్వదేవవ్రతమునందు "ఆనోభద్రాఃక్రతవో యంతు" అను సూక్తముచే ప్రధానాహుతుల జేయవలెను. తక్కినదంతయు ప్రాజాపత్య వ్రతమునందు వలెనే చేయవలెను. ఉపస్థానమునందు "ఆగ్నేవ్రతపతే—ఆగ్నేయవ్రతంచరిష్యామి" యని ఆగ్నేయవ్రతము నందును, "ఆగ్నేవ్రతపతే—వైశ్వదేవవ్రతం చరిష్యామి. యని వైశ్వదేవవ్రతమునందును, చెప్పవలెను. ఉపహోమములు, దేవతోపస్థానము, సూక్తము, జయాదులు, ఆపస్తంబ సమ్మతములుగావు. శాఖాంతరమునుండి వచ్చినవి. గావున శాఖాంతరులు జేయవలెను.

సౌమ్యవ్రతేతు సోమాయ కాండఋషయ ఇతీరితం।
సోమేధేనుమిదంసూక్తం సాంహితీభ్యఃప్రభృతయః ॥౩౨౯॥
ఉదంతిష్ఠా అపస్నాత్వా నమోనాచేతి శాంతికం।
జప్త్వా చతస్ర స్సమిధ స్సాజ్యా స్త్రాణౌదుంబరీ ర్వటుః ॥౩౩౦॥

పృథివీసమిది త్యేతై రుత్తిష్ఠన్నాదధాతిహి।
యుంజతే కృష్ణఇత్యాద్యా దశద్వాదశ చోత్తరే ॥౩౩౧॥
వా ఽ్రా ్రబ్రాహ్మణపాఠానుపాకాదిపద వాచనం।
యుంజతేసవితేత్యేతౌ ద్వావా వాచయతి స్ఫుటం ॥౩౩౨॥
అగ్నే వ్రతపతేకాండేత్యా ద్యుపస్థాన మాచరేత్।
శంనో వాత త్యాంతిజపన్సంమీల్యా హతివాససా ॥౩౩౩॥
శిర స్సంవేష్ట్య స్తమితే త్వగారంప్రవేశయేత్,
పరేద్యు ర్బ్రాహ్మణానాం చ భోజనం కారయేదితి ॥౩౩౪॥

స్నానము జేసి, నవర్షిపూజా తర్పణాదులజేసి, అగ్నింధనాద్యగ్ని ముఖాహుత్యంతమందు ''సోమాయ కాండర్షయే స్వాహా,, యని మంత్రముగా హోమము జేసి ''సోమో ధేనుం,, అను అనువాకముచే ఆజ్యాహుతుల జేసి, సాంహితీత్యాగ్యపహోమమును సదసస్పతి హోమమును జేసి, పాదంతి ( నీళ్లకాగు ) యందున్న ఉదకమును ఉపస్పర్శనము జేసి, ''నమోవాచా,, అను శాంతిని జపించి, ఆజ్యాక్తంబులగు నాలుగు ఔదుంబరీ (మేడి) సమిధలను ''పృథివీసమిత్. అంతరిక్షసమిత్, ద్యౌస్సమిత్। ప్రాజాపత్యామే సమిదసి, అను నాలుగు మంత్రములచే వటుడు నిలిచి అగ్నియందు వ్రేల్చవలెను. తర్వాత ''యుంజతే కృష్ణః,, ఇత్యాది పది మంత్రములను గాని పన్నెండు మంత్రములను గాని చెప్పించవలెను. అథవా ''యుంజతేసవితా,, ఇత్యాది మంత్రద్వయమును వటునిచే చెప్పించిన పిమ్మట ''అగ్నే వ్రతపతే కాండర్షిభ్యః సౌమ్య వ్రతం చరిష్యామి, ఇత్యాది మంత్రములచే దేవతోపస్థానము జేసి, ''శంనో వాతః'' యను శాంతిని పఠించవలెను. అనంతరము సంమీలనము జేసి నూతనవస్త్రమును శిరస్సునకు జుట్టి, సూర్యాస్తమయానంతరము గృహమునకు రావలెను. మరుదినంబున బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను.

## వేదవ్రతోత్సర్జనములు

* ఉత్సర్జనం కార్య మథద్యౌరాద్యైస్సమిధః క్షిపేత్।
వటోశ్చ కేశవపనం వ్రతేషూత్సర్జనేషు చ ॥ ౩౩౫॥
వదంతి కేచి త్సౌమ్యాఖ్యవ్రతపదే తరేషున ॥౩౩౬।

ఇట్లు వేదవ్రతములను జేసి, తదుత్సర్జనములను చేయవలెను. ''ద్యౌరాదివాక్యములచే సమిధలనగ్నియందు వ్రేల్చవలెను. వేదవ్రతములయందు, తదుత్సర్జనములయందు, వటునకు

* ఉత్సర్జనం త్వేవమేవేతి పాఠాంతరం

నాలుగవరోజు రాత్రి ప్రథమయామము గతించగా గంధర్వోద్వాసనము చేసి, దండమునకు చుట్టిన వస్త్రమును బ్రాహ్మణునకు ఇచ్చి, వధూసహితుడై అగ్నిని ఉపాసించి, శేషహోమమును చేయవలెను:

హస్తేనాదాయాత్ర విహాయాన్యా వశిష్టం
స్థాలీస్థాజ్యం శీర్ష్ణి వధ్వా నయేయుః।
ఆసీన స్స్యాన్మంత్రతో థాహుతీకే
సంపాతాజ్యం తద్గృహే న్యథా సః। ౩౮౯॥

పిదప ఆజ్యస్థాలియందు హోమము చేయగా మిగిలిన ఆజ్యమును హస్తముచే గ్రహించి, ఆసీనుడై వధువుశిరస్సునందు సమంత్రకముగా ఉంచవలెను. సంపాతాజ్యమును దశాహమునందు ఉంచవలెనుగాని, మరొకప్పుడు ఉంచకూడదని కొంద రాచార్యులు చెప్పుచున్నారు.

ఆజ్యశేషేణ హృదయదేశౌ యుగప దున్మృజేత్।
ఋచాంగుష్ఠానామికాభ్యాం తత స్త్రిసృఋచో జపేత్॥ ౩౯౦॥

పిదప హుతావశిష్టఘృతమును అంగుష్ఠానామికలతో గ్రహించి, ''సమంజంతు విశ్వేదేవాః'' అను ఋక్కుచే తనయొక్కయు, వధువుయొక్కయు, హృదయములను ఒక్కమారు స్పృశించి, 'ప్రజాపతే' ఇత్యాది మూడుఋక్కులను జపించవలెను.

తత స్త్వలీకాగమనం సఖీనాం।
నికృంతనం స్యాద్ధరిరాణికార్చనం।
స్రక్కంచుకాంతశూర్పయుగ్మా
న్న్యస్య్య స్సజాతీయసువాసినీభ్యః। ౩౯౧॥

అనంతరము అలికాగమనము, (దొంగవేలిమి) గోళ్లుతీసుకొనుట, లక్ష్మీపూజచేసి, పుష్పమాలికలు, కంచుకములు (రవికెలు) గలిగినకూర్ప (చేట) యుగ్మములను సజాతీయ సువాసినీస్త్రీలకు ఇయ్యవలెను.

## సమావేశము

తత్రోద్వాహోక్తత్రిరాత్రాంతదీక్షౌ
సంపూర్తౌ వాంఛావతో దారవత్యోః।
ప్రాదుర్భావే యావనే సత్వయం స్యా

# నరసింహ కారికా వృత్తి

తత్కాల స్త్రియా నైర్మిథునస్యోక్త ఏవ। ౩౧౨॥

వివాహాత్త్రిరాత్రిదీక్ష సమాప్తి అయినపిమ్మట మైథునేచ్ఛ గలిగినట్టి వధూవరులకు యౌవనము అంకురించినప్పుడే ఈసమయము మైథునమునకు యుక్తము అని చెప్పబడినది.

ఆరోహోరుం చానువాకం జపిత్వా।
కుర్యాత్పత్నీసంగమం శుద్ధరాత్రౌ।

పంచాంగశుద్ధికలిగిన రాత్రియందు "ఆరోహోరుం" అను అనువాకమును జపించి పత్నితో సంభోగించవలెను.

## రజస్వలాశాంతి

శస్తే నక్షత్రే రజో భూత్తదూర్ధ్వం।
దుష్టర్క్షే చేచ్ఛాంతికర్మోత్తరత్ర। ౩౧౩॥

మంచినక్షత్రములందు రజస్వల అయినయెడల స్నానానంతరమందును, దుష్టనక్షత్రములయందు రజస్వల అయినయెడల శాంతిజేసినతర్వాతను గర్భాధానము చేయవలెను.

దృష్టే రజసి దుష్టర్క్షే సతి శాంతిక్రియావిధిః।
జ్యోతిర్వసిష్ఠ జ్యోతిషశ్రీగర్గ్యసాభ్యాం విధీయతే।

దుష్టనక్షత్రములయందు రజస్వల ఐనయెడల శాంతివిధి జ్యోతిర్వసిష్ఠ, జ్యోతిశ్శాస్త్రులచే చెప్పబడినది.

చండాలీ పతితాసమా థ రజకీ శూద్రా దినాదిక్రమా।
చ్ఛుద్ధా పుష్పవతీ చ పంచమదినే హవ్యేషు కవ్యేషు చ।
చేద్దుష్టేహ్ని నవోదకుంభసలిలైః స్మార్తైస్త్రితైరావథై।
స్నానం పాపనుదం సపంచకినసైః కార్యాం సమృద్ధిర్జలైః॥

రజస్వలయైనస్త్రీ ప్రథమదినమున చండాలస్త్రీ సమానురాలనియు, ద్వితీయదినమున పతితస్త్రీసమానురాలు అనియు, తృతీయదినమున రజకీ (చాకలిది) సమానురాలు అనియు, చతుర్థదినము శూద్రస్త్రీసమానురాలు అనియు తెలిసికొనవలెను. హవ్యకవ్యములకు ఐదవదినమున అర్హురాలు. గర్భాధానాదులయందు ప్రథమరజస్వల యగుస్త్రీకి, నవోదకుంభసలిలములతోడను, సమంత్రకములగు ఓషధులతోడను, పంచగవ్యపల్లవములు గలిగినట్టియు, పవిత్రస్ఫూర్తికలిగినట్టి ఉదకములతోడను, సమస్తపాపములను

భార్యతో రాత్రి తృతీయభాగమునందు భోగించవలెను.

రజోదర్శనాదులయందు ప్రథమదివసనిర్ణయము

తృతీయభాగాది పరేహ్ని రాత్రి
ద్విభాగపర్యంత మహః పరేద్యుః।
రజస్వలాయా మృతుసంగమేపి
మృతౌ ప్రసూతావపి చాహు రార్యాః॥ ౩౬౫॥

ఉక్తప్రకారా దృతుసంగమం యదా।
యుగ్మాసు పుత్రాః ప్రభవంతి రాత్రిషు।
స్త్రియో హ్యయుగ్మాస్వితి ధర్మవేదినో॥
వదంతి తస్మా దృతుశోధనం స్మరేత్॥ ౩౬౬॥

పూర్వదినరాత్రి తృతీయభాగము లగాయతు పరదినరాత్రి రెండుభాగముల పర్యంతము పరదినమని వ్యవహరింపబడుచున్నది. రజోదర్శనమందును, ఋతుసంగమమునందును, మృతియందును, జననమందును ఉక్తరీతిగా దినగణనము చేయవలెనని ఆర్యులు చెప్పుచున్నారు. పూర్వోక్తప్రకారముగా యుగ్మరాత్రులయందు ఋతుమతియగు భార్యతో సంభోగించినయెడల పుత్రులును, బేసిరాత్రులయందు కుమార్తెలును కలుగుదురు అని ధర్మవేదులు చెప్పుచున్నారు. ఆకారణమువలన ఋతుశోధనము జ్ఞాపకముంచుకోవలెను.

చతుర్థీప్రభృతీత్యాది యావత్షోడశసమాప్తితః
నిస్సంశయత్వాత్సూత్రాణాం స్పష్టత్వా న్నుపేక్షితం॥

(చతుర్థీప్రభృతి' ఆప-గృ-౯-౧॥ ఇత్యాది ఖండసమాప్తి అగు గల సూత్రములు సంశయము లేనివగుటవలనను స్పష్టము లగుటవలనను ఉపేక్షింపబడినది.

## వైశ్వదేవకాలము.

వైశ్వదేవస్య సంస్థాత్వా న్నిత్యత్వా దాత్మశుద్ధయే।
వైశ్వదేవస్తు కర్తవ్య స్స్థాలీపాక పూర్వకః॥ ౩౬౭॥

వైశ్వదేవము సంస్థ అగుటవలనను, నిత్యము అగుటవలనను ఆత్మశుద్ధికొరకు వైశ్వదేవస్థాలీపాకపూర్వకముగా చేయవలెను.

నోతద్వ్యేతే యావదాగ్నేయవైశ్వ

దేవస్థాలీపాకహోమా చతావత్॥
నోత్పత్తిశ్చౌపాసనస్యాథ వైశ్వ
దేవస్యాప్యుత్పత్తిరేవాత్ర నోక్తా॥ ౩౭౦॥

ఎప్పటివఱకు ఆగ్నేయస్థాలీపాక, వైశ్వదేవస్థాలీపాకములు చేయపడవో అంతవఱకు ఔపాసనము వైశ్వదేవము జేయగూడదు.

కర్తవ్యాత్రౌపాసనారంభ ఆ
గ్నేయస్థాలీపాకహోమే కృతేతు॥
ప్రారంభస్స్యాద్వైశ్వదేవస్య వైశ్వ
దేవస్థాలీపాకహోమే సమాప్తే॥ ౩౭౧।

ఆగ్నేయస్థాలీపాకము సమాప్తి అగుటతోడనే ఔపాసనము ప్రారంభింపవలెను. అట్లనే వైశ్వదేవస్థాలీపాకము సమాప్తిఐనవెంటనే వైశ్వదేవము ప్రారంభింపవలెను.

వైశ్వదేవమునకు దేవతానిర్ణయము

యే దేవతే విహితే యే తే స్థాలీపాకే గ్నిదైవతే।
ఔపాసనేపి తే ఏవ సాయం ప్రాతస్తు దేవతే॥ ౩౭౨।

ఆగ్నేయస్థాలీపాక దేవతలగు అగ్నియు, అగ్నిస్విష్టకృత్తును, ఔపాసనమునకు గూడ దేవతలనుగా తెలిసికొనవలెను.

యాః ప్రోక్తాస్స్యుర్వైశ్వదేవస్థాలీపాకేపి దేవతాః।
సాయం ప్రాతర్వైశ్వదేవే ప్యుక్తాస్తా ఏవ దేవతాః॥

వైశ్వదేవస్థాలీపాక దేవతలనే వైశ్వదేవ దేవతలనుగా తెలిసికొనవలెను.

స్థాలీపాకే వైశ్వదేవే ప్రధానా
స్తత్రాగ్న్యాద్యా రౌద్రపర్యంతమంత్రాః।
వేదోక్తాస్తా దేవతా వైశ్వదేవే
విశ్వేదేవాహీతి సూత్రాదితాద్గాత్॥ ౩౭౩।

వైశ్వదేవస్థాలీపాకమునందు ప్రధానములగు అగ్న్యాది రౌద్రపర్యంత మంత్రములు వేదమందు చెప్పబడినవి. “వైశ్వదేవే విశ్వేదేవాః” ఆప-గృ-౭ ౨౭॥ అను సూత్రమువలన దేవతలు చెప్పబడెను.

ఆగ్నేయాదయ ష్షడ్ఢోమా బలిహరణాని చానగ్నిదేశ్యాన్యపి।

సర్వాణ్యాపి ప్రధానాని నహి కించదపి శేషా చరణ మంగమితి
సూత్రార్థః॥ ౩౨౪।

ఆగ్నేయాది అణుహోమములు అగ్నియందు వ్రేల్వబడు బలులు అన్నియు ప్రధానములు. శేషాచరణము గల అంగము కించిత్తును లేదు. అని "వైశ్వదేవః శ్వ దేవాః" ఆప-గృ-౭-౨౦॥ అను సూత్రముయొక్క అర్థము.

సుదర్శనేనే త్థముదీరితార్థా త్సర్వే ప్రధానా ఇతి నిశ్చితాస్స్యుః
ఏవంచ గార్గ్యో వరదోపి గృహ్యప్రదీపకాకృద్గురు రుక్తవాన్హి।

సుదర్శనునిచే ఈప్రకారముగా చెప్పబడిన అర్థమువలన అందఱు ప్రధానులు అని నిశ్చయింపబడుచున్నారు. గర్గవంశీకుడును, గృహ్యప్రదీపికాకారుడును, గురువును, అగు వరదరాజుకూడ ఈప్రకారముగానే చెప్పియున్నాడు.

కర్తవ్య త్వా త్కర్మణో వైశ్వదేవ
కర్మ ప్రారంభాధి కారార్థసిద్ధ్యై।
పత్నీయుక్తః కర్మణో వైశ్వదేవ
స్థాలీపాకం కర్మ కుర్వీత విప్రః॥ ౩౨౫।

కర్మచేయతగినదగుటవలన వైశ్వదేవారంభాధికారము కొఱకు పత్నీయుక్తుడై విప్రుడు వైశ్వదేవస్థాలీపాకమును చేయవలెను.

వైశ్వదేవప్రారంభము.

వివాహార్థం వైశ్వదేవ మంత్రాణా ముపయోగకే।
ద్వాదశాహ మాధశ్శయ్యాపి చరేచ్ఛ సభార్యకః॥ ౩౨౬।
ఇత్యుక్త్వాథ ప్రశస్తేహన్యారభ్యేతిసుదర్శనః
ప్రాహ రభ్యేతి వాక్యేన స్థాలీపాకో వగమ్యతే॥ ౩౨౭।

వివాహానంతరము వైశ్వదేవ మంత్రములనుచెప్పకొనుటకై పత్నీయుక్తుడై పన్నెండు దినములు అధశ్శయ్యాది బ్రహ్మచర్యమును చేయవలెనని చెప్పి ప్రశస్త దినంబున ఆరంభించి అని సుదర్శనాచార్యుడు తద్భాష్యమునందు వ్రాసియున్నాడు. "ఆరభ్య" యను వాక్యమువలన స్థాలీపాకము చేయవలెనని తోచుచున్నది.

అథార్యాః ప్రయతా వైశ్వదేవే న్నేత్యాపస్త్యుదీరితం।
సూత్ర మేత త్సాయం ప్రాత ర్వైశ్వదేవక్రియాపరం।

"ఆర్యాః ప్రయతా వైశ్వదేవన్నసంస్కర్తారస్స్యుః" ఆప-ధ-౨-౩-౧। అను

సూత్రము సాయంప్రాతః కాలములయందు వైశ్వదేవమును జేయవలెనని చెప్పుచున్నది

వైశ్వదేవస్థాలీపాకము.

అత్రైవ తదుక్తం భవతి ప్రసంగా
ద్ద్వాదశ్యాత్సమావేశన కృచ్ఛ్రేపాన్తాత్।
సాంగే వివాహే సతి వైశ్వదేవ్యా
పయోగమంత్రాధ్యయనం చతుర్భ్యాన్॥ ౩౦॥
సద్వాదశాహవ్రత మాత్ర చాథ
శయ్యాది పత్నీసహితశ్చరిత్వా।
త్రయోదశే హన్యుపవాస కృత్వా స్య
చ్చతుర్దశే హ్న్యేవ హిపౌర్ణమాస్యాం॥ ౩౧॥
పక్వా స్థాలీపాక మహాపసనాగ్నౌ
పద్మాస్యో దర్భ ద్రింషి స్థాప్య వహ్నేః
జ్వాలాకార్యాద్యాజ్యభాగావసానే
స్థాలీపాకాచ్చావదాయావదాయ॥ ౩౨॥
హోతవ్యస్స్యాత్సమంత్రపాఠక్రమేణ
హవ్యకాద్రాన్తా త్త్రింశదగ్న్యాదయశ్చ
సవ్యేనై వాత్రాపి హిత్యాహుతి స్స్యా
న్నో శమ్యా సస్య స్విష్టకృద్ధోమ వాత్ర॥ ౩౩॥
హుత్వా బర్హిష్యాం జనం హోమశేషం।

* “సమావేశనజపాన్తే వివాహే సమాప్తే” అను సుదర్శన వాక్యమువలన సమావేశన జపాంతమగు వివాహము సమాప్తమైనతర్వాత వైశ్వదేవహోమప్రయోగమంత్రములను చదువుచూ, పన్నెండు రోజులు బ్రహ్మచర్యము అధశ్శయనము మొదలగు ధర్మములతో వైశ్వదేవ వ్రతమును చేసి, పదమూడవరోజున ఉపవాసము చేసి, పదునాలుగవ రోజు అగు పూర్ణిమనాడు (శుక్లపాడ్యమినాడు వైశ్వదేవవ్రతము ప్రారంభించినయెడల పదమూడవరోజు చతుర్దశిగాను, పదునాలుగవరోజు పూర్ణిమగాను, అగును.) ఔపాసనాగ్నియందు స్థాలీపాకమును చేసి, ఉత్తరముగా దించి, బర్హిస్సునందు ఉంచి, అగ్నింధ

* సుదర్శన భాష్యము ౮౦ పేజీ

నాద్యాద్యాభాగాంతమునందు స్థాలీపాకమునుండి గ్రహించి, మంత్రపాఠక్రమముగా అగ్న్యాది రౌద్రాంతములగు ముప్పది హోమములు చేయవలెను. వైశ్వదేవ స్థాలీపాకమునందు పిత్ర్యాహుతి సవ్యముగా చేయవలెను. పరిధులు వేయవలెను. స్విష్టకృద్ధోమానంతరము బర్హిస్సంజనము చేసి; హోమశేషమును సమాప్తి పొందించవలెను.

### వైశ్వదేవము.

కృత్వా గార్హ్యాదన్న మాదాయ సిద్ధం।
పాత్రేష్వన్నం పంచధా కల్పనీయం
తత్పార్థక్యా ద్వైశ్వపాత్రేపి వాంశాన్ ॥౩౮౪॥
హోమార్థ మేకత్ర హవిష్య మన్నం
పాత్రే ప్రకల్ప్య హ్యహవిష్యజాతం।
క్షారాది ముద్గాది యుతం ద్వితీయే
దేవాధ్వరార్థం చ హవి స్తృతీయే ॥౩౮౫॥
అగ్రార్థ మన్నా దఖిలా చ్చతుర్థే
తద్వ న్మనుష్యాయ చ పంచమేపి।
సుదర్శనేనైవ ముదీరితం స్యా
త్పిత్ర్యః క్రతో ర్భూతమఖస్య కల్ప్యం॥ ౩౮౬।
హోమాగ్రభాగా ద్బలయో ద్వితీయా
ద్భూతాగ్రదేవక్రతవ స్తృతీయాత్,
పిత్రధ్వరాయైవ చతుర్థభాగో
మనుష్యయజ్ఞాయ హి పంచమాంశః॥౩౮౭।
ఇత్థం విభాగం ప్రవదంతి శిష్టాః
పక్షద్వయే ప్యేక మిహావలంబ్య।
క్షీరాజ్యదధ్యాదిభి రక్త మన్నం
హస్తేన చాదాయ తదగ్రభాగాత్॥౩౮౮।
ఔపాసనాగ్నౌ జుహుయా త్షడాహుతీ
రగ్న్యాదికా స్స్విష్టకృ దస్తిహాతాత్।

తస్మాన్నసోమో స్త్వ్యత సప్తమాష్టమా
భ్యా మాంగిరాచార్య మతే న్వతిస్న ॥౩౮౯।
తస్మాదభూ త్స్విష్టకృతం హిమష్టకం
హోమా త్పరం చో త్తరతో ష్ఠభస్మని।
క్షౌరాద్య పరామ్యాం జుహుయాచ్ఛ హోమా మయోః

• గృహమునుండి అన్నమును తీసుకుని వచ్చి, ఆఅన్నమును ఐదుభాగములనుగా జేసి, ప్రత్యేకప్రత్యేకముగా ఐదుపాత్రలయందుగాని, ఒకపాత్రమునందుగాని, ఉంచవలెను. ప్రథమపాత్రమునందు హోమార్థమగు అన్నమును, ద్వితీయపాత్రమునందు క్షౌరముద్గ సహితము అగు ఆహవిష్యాన్నమును, తృతీయపాత్రమునందు దేవయజ్ఞార్థమగుఅన్నమును చతుర్థపాత్రమునందు అగ్రదానార్థమగు అన్నమును, పంచమపాత్రమునందు మనుష్య యజ్ఞార్థమగు అన్నమును ఉంచవలెనని నృసింహాచార్యులు తనభాష్యమందు వ్రాసియున్నారు. మఱికొందఱు ప్రథమభాగమునుండి హోమమును, ద్వితీయభాగమునుండి బలులను, తృతీయభాగమునుండి భూతయజ్ఞ దేవయజ్ఞాగ్రదానములను, నాలుగవభాగమునుండి పితృయజ్ఞమును, ఐదవభాగమునుండి మనుష్యయజ్ఞమును, చేయవలయునని చెప్పుచున్నారు. పూర్వోక్త పక్షద్వయమునందు ఒకపక్షము నవలంబించి, పాలు, నెయ్యి, పెరుగు మొదలగువానిచే నభిఘరించబడిన అన్నమును ప్రథమభాగమునుండి గ్రహించి, ఔపాసనాగ్నియందు అగ్న్యాది స్విష్టకృదంతములగు (అగ్నయే స్వాహా విశ్వేభ్యోదేవేభ్యస్స్వాహా, ధ్రువాయ భూమాయ స్వాహా, ధ్రువక్షితయే స్వాహా, అచ్యుతక్షితయే స్వాహా, అగ్నయే స్విష్టకృతే స్వాహా'' అని) ఆఱుహోమములను చేయవలెను. స్విష్టకృత్తుకలదు అనిపఠించుటవలన సోమహోమాతిదేశము. ఆంగీరసమతమునందు ఎనిమిది హోమములుగలవు. ఎనిమిది హోమములు చేయవలెనని ఎచ్చటను చెప్పక పోవుటవలన స్విష్టకృద్ధోమము ఆఱవది అని ఎఱుంగవలెను. హోమానంతరము అగ్నికి ఉత్తరదిక్కున ఉన్నభస్మయందు క్షౌరముద్గ సహితమగు ఆహవిష్యమును హోమమును చేయవలెను. ''హోమాదారాః'' అనుపద్యమువకుమునుందు శ్లోకముతో నన్వయము.

బలిహరణ ప్రకారము.

శేషంతు సంసృజ్య బలిం త్సమాచరేత్ ॥ ౩౯౦।
దేశేదేశే స్యా ద్బలీనాం ప్రమృజ్యా
ప్రోక్ష్య న్యస్యా సేచనం చాత్రనానా।
అంగుళ్యగ్రాశ్చ స్పృశంతీ హయద్వా

ద్వ్యాఙ్గుళం తద్వ ద్యావకీమాత్రమానం॥ ౩౯౧।
నానాప్రదేశార్హ బలీం స్త్వనుస్య
వహ్నేః ప్రతీచ్యాం తుసమాచరంతి॥
అగ్నేః ప్రతీచ్యా ముత సప్తమాష్టమా
భ్యాం దద్యా ద్బలీ ధర్మబలేః పురస్తాత్॥ ౩౯౨।
అద్భ్యస్ స్త్వతి స్త్వత్పురస్త స్త్వదూర్ధ్వం
ద్వాభ్యా మధర్మాఖ్యబలే రుదక్తః।
గృహ్యాభ్య ఇత్యాది చతురోపవర్గాణాం
ప్రాక్పఙ్క్తి మేతా శ్చతురో ప్ర దద్యాత్॥ ౩౯౩।
బలే రధర్మా త్పురత స్తు కామబలి స్తతః ప్రాగ్దిశి చాంతరిక్షం
తత్ప్రాగ్వ్యదేశస్య తు దక్షిణేతు దద్యా త్పృథివ్యై ప్రభృతీశ్చ
ఇత్థం॥ ౩౯౪। ప్రాక్పఙ్క్తి రేవం స్వధవాహ్య పితృభ్య స్త్వ దక్షిణస్యాం
దిశి నిర్ఋత్య రౌద్రయోః, ప్రసవ్య సవ్యేన బలీ ప్రదద్యా త్త
ద్దైవ కుర్యా త్పరిషేచనంచ॥ ౩౯౫॥

హోమావశిష్ట ప్రథమ ద్వితీయ భాగములను కలిపి బలులను వేయవలెను. బలులు వేయు ప్రదేశములయందు మార్జనము, అవోక్షణము, నిర్వపణముచేసి, వేఱు వేఱుగా పరిషేచనము చేయవలెను. బలులు ఉంచునపుడు అంగుళ్యగ్రములు భూమిని స్పృశిం చవలెను. బలిప్రమాణము రేగుపండు అంతయుండవలెను. అనేక ప్రదేశములయందు వేయుబ డు బలులను అగ్నికిపశ్చిమదిక్కునఇప్పటివారు వేయుచున్నారు. అగ్నికి పశ్చిమభాగమున ఏడు, ఎనిమిది మంత్రములతో "ధర్మాయస్వాహా, అధర్మాయస్వాహా, అను బలులను ఉంచవలెను. ధర్మబలికి తూర్పుగా" అద్భ్యస్స్వాహా, ఓషధి వనస్పతిభ్యస్స్వాహా, రక్షోదేవజనేభ్యస్స్వాహా, అను బలులను వేయవలెను. అనంతరము అధర్మబలికి ఉత్త రభాగమున "గృహ్యాభ్యస్స్వాహా, అవసానేభ్యస్స్వాహా, అవసానపతిభ్యస్స్వా హా, సర్వభూతేభ్యస్స్వాహా, అను నాలుగుబలులను ప్రాక్సమాప్తిగా ఉంచ వలెను. అధర్మబలికి దూరుభాగమున కామబలిని, దానికితూర్పున అంతరిక్షబలిని దానికి తూర్పుభాగమున "యదేజతిజగతి" అనుమంత్రముచే బలిని, ఉంచి ధర్మబలికి దక్షి ణపు దిక్కున పృథివ్యాది పదిబలులను ప్రాక్సమాప్తిగాంచిన స్వాహాకారముగానుం డును. పృథివ్యాది బలుల దక్షిణమున అపసవ్యముగా పితృబలిని, సవ్యముగా రౌద్ర

పాకాద్యా తిథ్యంత కృద్వైశ్వదేవ
స్సాయం ప్రాతర్భార్య ఔపాసనాగ్నౌ
కర్తవ్య స్స్యాద్గృహ్యతాం ప్రోషితోపి
తద్భార్యా చాన్యైః కారయే న్మందిరేతు॥ ౮౦౦।

పాకాదియు, అతిథ్యంగము అగు వైశ్వదేవమును ప్రతిదినమునందు సాయంప్రాతః కాలములయందు ఔపాసనాగ్నియందు చేయవలెను. యజమానుడు ప్రవాసమునందు న్నపుడు పత్ని అన్యులచే గృహమునందు చేయించవచ్చును.

ఆచార్యైర్వైశ్వ కర్మాఖ్య సూత్రా
దుక్తం "చార్యాః ప్రయతా వైశ్వదేవే"
ఇత్యారభ్య హ్యతిథ నేవ చాగ్రే
భోజయే దిత్యంతకం వైశ్వదేవం॥౮౦౧।

"ఆర్యాః ప్రయతా వైశ్వదేవే" ఆప-ధ-౨-3 ౧॥ అనునది మొదలు "అతిథీ నేవ చాగ్రే భోజయేత్" ఆప-ధ-౨-౮-౧౦॥ అనునంతవఱకు ఆచార్యునిచే వైశ్వదేవము చెప్పబడినది.

ప్రవాసమందు వైశ్వదేవము.

లోకాగ్నౌ చానాహితాగ్నిర్వి ప్రవాసీ
కుర్వీతాగ్రం పంచయజ్ఞా నహరాహ్యం।
ఉష్ణే భస్మ న్యాహితాగ్ని స్త్వనగ్నిః
కుర్వీతాగ్నౌ లౌకికే వైశ్వదేవం॥ ౮౦౨॥

అనాహితాగ్నియు, ప్రవాసియు, వైశ్వదేవమును, పంచమహాయజ్ఞములను, అగ్రదానమును లౌకికాగ్నిలో చేయవలెను. హోమద్రవ్యము కానిది ఉష్ణభస్మహోమము చేయవలెను. విచ్ఛిన్నాగ్నియగు ఆహితాగ్ని వైశ్వదేవమును లౌకికాగ్నిలో చేయవలెను.

రోగో పవాసాది పరాన్న భోజనా
ద్యాపత్సు సత్స్వప్యశనం ప్రయత్నతః॥
కర్తవ్య మేవాహని సాయ మన్వహం
స్యా ద్వైశ్వదేవం త్వథ పంచచాధ్వరాః॥ ౮౦3॥

కుర్యాత్తనోచేద్య దిపక్వమన్నం ఫలానిమూలా న్యథ తం
దులాది। యథాధికారంజుహుయాచ్ఛ వహ్నౌ జలంచ తే
వ స్త్వపి చాగ్న్యభావే, ౪౦౪॥

శ్లో॥ గతా...కు ప్రవాసము, పరాన్నభోజనము మొదలగు ఆపదలయందు ప్రయుక్తపూర్వకముగా అన్నమునుగాండి సాయంప్రాతఃకాలములయందు వైశ్వదేవమును పంచమహాయజ్ఞములను చేయవలెను. పక్వాన్నము సంభవము కాకపోతే ఫలములు దుంపలు బియ్యములాదికము మొదలగు వస్తువులను యథాధికారముగా అగ్నియందు హోమము చేయవలెను అగ్ని లేకపోయిన యడల ఉదకమును గాని ఫలాది పదార్థములను గాని ఉదకమందు హోమము చేయవలెను.

ఇమమేవార్థమన్యత్రస్పష్టం శిష్టై రుదాహృతం
"పక్వాభావే ప్రవాసేచ తండులా నోషధీస్తువా। ౪౦౫॥
పయోదధి ఘృతంవాపి కందమూల ఫలానివా।
యోజయేద్దేవయజ్ఞాదౌ జలంవా సక్తువాజలే। ౪౦౬॥

పూర్వోక్తప్రకారముగా గ్రంథాంతరములయందు శిష్టులు స్పష్టముగా చెప్పియున్నారు. పక్వాన్నము సంభవము కాకపోయినపుడును, ప్రవాసమువందును, బియ్యము ఓషధులు, పాలు, పెరుగు, నెయ్యి, కంద, దుంపలు, ఉదకము, సక్తు, పిండి మొదలగు పదార్థములు వైశ్వదేవమునందు ఉపయోగించవచ్చును. అగ్ని లేకపోయినయడల ఉదకమునందు హోమము చేయవచ్చును.

## వైశ్వదేవావశ్యకత

వైశ్వదేవావశ్యకత్వమాహ శాతాతపోమునిః।
శాతాతపముని వైశ్వదేవము అవశ్యముగా చేయవలెనని చెప్పియున్నాడు.
"వైశ్వదేవ విహీనాయే ఆతిథ్యేన వివర్జితాః,
సర్వేతేవృషలాజ్ఞేయాః ప్రాప్తవేదా అపిద్విజాః, ౪౦౭॥
వైశ్వదేవహీనులు, అతిథ్యవర్జితులు అగు ద్విజులు సాంగవేదసంపన్నులయినను శూద్రులు అగుచున్నారు. అని ఎఱుంగవలెను.

ఉక్తంచ భగవద్గీతాస్విమమేవార్థముత్తమం ॥౪౦౮॥
"ఇష్టాన్భోగాన్హి వోదేవా యజ్ఞభావితాః

ైర్దత్తానప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవసః। ౨౦౯॥
యజ్ఞశిష్టాశినస్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః।
భుంజతే తేత్వఘంపాపా యే పచంత్యాత్మకారణాత్। ౨౧౦॥

యజ్ఞభావితులగు దేవతలు మీకు ఇష్టములగు సమస్తభోగములను ఇచ్చుచున్నారు. దేవతలచే నివ్వబడిన ఆభోగములను దేవతలకు పెట్టక ఎవ్వడు భుజించునో అతడు దొంగయగును. యజ్ఞశేషమును భుజించువారలు సర్వపాపములవలన విముక్తిని బొందుదురు. ఎవరు తమకై వండుకొనుచున్నారో వారలు పాపమును భుజింతురు. అని స్పష్టముగా భగవద్గీతలయందు శ్రీకృష్ణభగవానుడు చెప్పియున్నాడు. అందువలన వైశ్వదేవము అవశ్యముగా చేయవలెను.

యజ్ఞోపవీతీ జుహుయాచ్చ దేవతీర్థేన చోత్తానకరేణచా
న్నం। తద్వైశ్వదేవాదిషు హస్తసాధ్య హోమేషు స
ర్వేష్వపి తండులాదీన్। ౨౧౧॥

హస్తసాధ్యహోమములగు వైశ్వదేవాది సమస్తకర్మలయందు అన్నమునుగాని, తండులాదికమునుగాని, యజ్ఞోపవీతియై ఉత్తానహస్తుడై దేవతీర్థముతో హోమమును చేయవలెను.

బలులను స్వయముగా తీసివేయకూడదు

వైశ్వదేవబలీనాంతు నదోషో దర్శనేక్వచిత్।
స్వయముద్ధరణే దోష స్తస్మాదన్యైస్తుకారయేత్। ౨౧౨॥

వైశ్వదేవబలులను చూచిన దోషములేదు. బలులను స్వయముగా తీయగూడదు. ఇతరులచే తీసివేయించవలెను.

అనుద్ధృత్య బలీనశ్నన్ ప్రాణాయామాంత్రయాచరేత్॥
స్వయముద్ధరణే చేత్తు ప్రాజాపత్యం సమాచరేత్। ౨౧౩॥

బలులను ఎత్తకుండా భుజించినయెడల ఆరుప్రాణాయామములను చేయవలెను. స్వయముగా బలులను ఎత్తినచో ప్రాజాపత్యమును చేయవలెను.

నిత్యప్యరాహ్వంబలీన్ దద్యాన్నైవ పాత్రాంతరేక్వచిత్।
ఉద్ధృత్యాగ్నౌ విప్రాన్నక్షిపేద్వా పరిసద్మనాం। ౨౧౪॥

రాత్రులయందును భూమియందే బలులను ఉంచవలెను. పాత్రాంతరమునందు

ఉంచకూడదు. బలులను ఎత్తి ఆవులకుగాని బ్రాహ్మణులకుగాని ఉదకములయందుగాని ఉంచవచ్చును. లేదా ఇంటిమీదకు సైనను వేయవచ్చును.

## బ్రహ్మయజ్ఞ కాలము

ప్రాతస్స్నాత్వా కర్మసంధ్యాదికృత్వా।
  శ్రౌతంస్మార్తం చాగ్నికృత్యం సమాప్య।
స్వాధ్యాయస్యాధ్యాపనాద్యంత్రగేహా।
  యోగక్షేమం పిత్ర్యసర్వం తదూర్ధ్వం। ౮[illegible]౬॥
యోబ్రహ్మయజ్ఞే నచ యక్ష్యమాణః ప్రాచ్యాముదీచ్యామపరాజితాయాం। గ్రామాద్బహిస్థ హ్రదకూపవాపీనదీ తటాకాదయుపవయంత్ర। ౮౧౭॥ సంత్యంత్రగత్వా విధినాద్వితీయ స్నానంచ మాధ్యాహ్నిక మత్రకృత్వా గృహ్యాంతరోక్త స్మృతిషూదితత్వా తత్స్నానాత్పరం బ్రహ్మమఖంచ కుర్యాత్। ౮౧౮॥

ప్రాతస్స్నానానంతరము సంధ్యావందనమును చేసికొని, శ్రౌతస్మార్తాగ్నిహోత్రములను చేసి, శిష్యులకు వేదమునుచెప్పి, గృహమునందు యోగక్షేమములను కనుగొనినపిమ్మట బ్రహ్మయజ్ఞమును చేయువాడై, గ్రామమునకు తూర్పుదిక్కునగాని, ఉత్తరదిక్కునగాని ఉన్నకూపము, దిగుడుబావి, చెరువు, నది మొదలగువానియందు యథావిధిగా మధ్యాహ్నిక స్నానమును చేసి, మాధ్యాహ్నిక సంధ్యావందనానంతరము బ్రహ్మయజ్ఞమును చేయవలెను. గృహ్యాంతరములయందును, ధర్మశాస్త్రములయందును, మాధ్యాహ్నికస్నానానంతరము బ్రహ్మయజ్ఞము చేయవలెనని చెప్పబడి యున్నది.

## బ్రహ్మయజ్ఞవిధి

అప్సుస్నాత్వాగమ్య యజ్ఞోపవీత
  భూత్వావిప్రోధౌతవస్త్రాంబరస్సన్।
ప్రాగ్గాసీనో బ్రహ్మయజ్ఞేనయక్ష్య
  ఇత్యాచమ్యోర్ధ్వ త్రోదకం స్పృశ్యదోర్భ్యాం। ౮౧౯॥
విద్యున్మంత్రేణాథ శుద్ధోదకైస్త్రి

రాచామేదిత్యాది వ్యాహృత్స్పర్శనాంతం।
కృత్వా కృత్యుక్తాచమనంచ సవ్యే
పాదేపాదం దక్షిణం స్థాప్యతస్మిన్। ౭౧౯॥
జానున్యుత్తానం కరం స్థాప్యతస్మి
న్నాస్రిగగ్రే ద్వేతే పవిత్రేనిధాయ।
ప్రాంచంసవ్యంచం దక్షిణం స్థాప్యహస్త
మోమిత్యుక్త్వా వ్యాహృతీ స్త్రిస్సఉక్త్వా॥ ౭౨౦॥
దేవ్యాఃపాదం పాదముక్త్వార్ధమర్ధం
తూక్త్వా సర్వాంచా విరామంజపిత్వా।
ప్రాగగ్రా నాస్తీర్య దర్భాన్ బహూంశ్చ
తేషూపస్థాఖ్యాసనంత ద్విశేషం। ౭౨౧॥
సవ్యేపాదే దక్షిణం స్థాప్యచోరుం
సవ్యేహ్యూరౌ దక్షిణం స్థాప్యపాదం।
ఏవంరూపోపస్థ సంజ్ఞాననేస్మి
న్నాస్రిగాస్య స్వాధ్యాయ మత్రారభేత। ౭౨౨॥

యజ్ఞోపవీతియై పద్మాదులయందు స్నానముచేసి, ఆచమనము చేసి, ఆరవేసిన ధౌతవస్త్రమును ధరించి, ప్రాఙ్ముఖముగా నాసీనుడై "బ్రహ్మయజ్ఞేనయక్ష్యే" అని సంకల్పించి, "విద్యుదసి విద్యమే పాప్మాన మృతాత్సత్యముపైమి" అనుమంత్రముచే ఉదకోస్పర్శనము చేసి, కృత్యాచమనమును చేసి, వామపాదమునందు కుడిపాదమును ఉంచి, కుడిమోకాలిమీద వెల్లికిలగానుంచిన వామహస్తమునందు రెండుపవిత్రములను ఉంచి దానిమీద కుడిచేతిని ప్రాఙ్ముఖముగా బోర్లించి, "ఓంభూర్భువస్సువః" అనిపలికి గాయత్రిని ముందుగా ప్రతిపాదమునందును ఆపిచెప్పి, రెండవమారు అర్ధర్చగాచెప్పి, మూడవపర్యాయము అవిరామముగా గాయత్రీమంత్రమును అంతయు చెప్పి, ప్రాగగ్రములుగా వేయబడిన దర్భలయందు ఉపస్థాసనము చేసి కూర్చొని, స్వాధ్యాయమును ప్రారంభించవలెను. ఉపస్థాసనము ఎట్లుచేయవలెనగా వామపాదముమీద కుడితొడనుంచి ఎడమతొడమీద కుడిపాదము నుంచిన అది ఉపస్థాసనము అనబడును.

(అనగా స్వస్తికము చేసి కూర్చొనుట)

## స్వాధ్యాయస్వరూపము

అధ్యేతృభిః పితృ పితామహ ప్రపితామహ
పూర్వైః క్రమాధ్యయన పారంపరంతరాయత్।
స్వాధ్యాయ మిత్యభిహితం హితమ ప్రకర్మా
నుష్ఠాన కారణవిధా వుపయోగితత్స్యాత్। ౮౩॥

పితృపితామహ ప్రపితామహాదుల అధ్యయన పారంపరంపరను స్వాధ్యాయమని పేరు. అదియే సమస్తకర్మానుష్ఠానమునకు ఉపయోగించును.

అధ్యేతవ్యం ప్రత్యహం బ్రహ్మయజ్ఞే
స్వాధ్యాయంస్తై ద్యథాశక్తి కృత్స్నం
తత్రేషేత్వోర్జ ప్రభృత్యేవ కాండం
ప్రశ్నంసూక్తం చానువాకం యజుర్వా। ౮౪॥

అర్ధంవాధీయా స్మ్రతిజ్ఞాపకేవి
నమ్యాన్స్వా హాత్రిర్నమో బ్రహ్మణేతి।
వృష్టిస్మంత్రే ణోదకం స్పృశ్యదోర్భ్యాం।
మాచమ్యాథోతర్పణం స్యాద్యతాసుః। ౮౫॥

ప్రతిదినమున బ్రహ్మయజ్ఞమందు ఆస్వాధ్యాయమునంతను యథాశక్తిగా అధ్యయనము చేయవలెను. అందు ముందుగా "ఇషేత్వోర్జేత్వా" అనునది మొదలు ప్రతిరోజున ఒకకాండమునుగాని, ఒకప్రశ్నమునుగాని, ఒకసూక్తమునుగాని, ఒకఅనువాకమునుగాని, ఒకయజుస్సునుగాని, ఒకయజురర్ధమునుగాని, జ్ఞాపకమున్నంతవఱకు ఆగకుండా చెప్పవలెను. అంతమునందు "ఓంనమో బ్రహ్మణే నమో అస్త్వగ్నయే" యను మంత్రమును ముమ్మారు ఉచ్చరించి, "వృష్టిరసి వృశ్చమే పాప్మాన మృతాత్సత్యముపాగామ్" యనుమంత్రముచే ఉదకమును స్పృశించి ఆచమనము చేసినపిమ్మట ప్రాణాయామముచేసి, తర్పణమును చేయవలెను.

ఏవంకర్తుంనో సమర్థోయదిస్యా
ద్గాత్రిమేస్వాధ్యాయం త్వధీయీతవిప్రః।
అంతర్గేహేమానసే నైవవాహ
ర్నక్తంతిష్ఠ న్వాశయానో వ్రజన్వా। ౮౬॥

స్నాత్వా వైశ్వదేవం గృహదేవతార్చనం
హ్యభ్యాగతానా మతిథేశ్చపూజనం
అభ్యాగతా జ్ఞాత చరామనోహరా
అజ్ఞాతగోత్రో తిథిరాగతోహఠాత్, ౨౨౩॥

* ఇంటికివచ్చి, వైశ్వదేవమును చేసినతర్వాత దేవతార్చనముచేసి, అభ్యాగతులను అతిథులను పూజించవలెను. అజ్ఞాతులగువారు అభ్యాగతులనియు, భోజనసమయమున హఠాత్తుగా వచ్చిన అజ్ఞాతగోత్రుడగు నతడు అతిథి అనియు చెప్పబడుదురు.

## ఉపనయన కాలము

గర్భాష్టమేష్వితిప్రోక్తమాచార్యైస్తైవతత్రతు।
జన్మతఃపంచమేషష్ఠే సప్తమేవోపనాయనం ॥౨౨౪॥
కర్తవ్యంబ్రాహ్మణస్యేతి సూత్రార్థస్సముదాహృతః ।
రాజ్ఞస్తునవమాదూర్ధ్వందశమాద్వాత్పరంవిశః ॥౨౨౫॥
ఆచార్యస్యమతంచేదం తతోమనుమతంస్మృతం ।
"బ్రహ్మవర్చసకామస్య కార్యంవిప్రస్యపంచమే ।
రాజ్ఞో బలార్థినష్షష్ఠే వైశ్యస్యేహార్థినోష్టమే" ౨౨౬
"వటుఃపటుతరప్రజ్ఞాశాలీచేద్బ్రహ్మవర్చసం
అపేక్ష్యపంచమేవర్షేషష్ఠేవాసప్తమేపివా" ॥౨౨౭॥
ఇతిగృహ్యాంతరంబ్రహ్మవర్చసంనవమేస్మృతం ॥౨౨౮॥
కశ్యపేనాథదశమాదూర్ధ్వంకామ్యంచమధ్యమం।
నీచంత్రయోదశాదూర్ధ్వంపతత్యూర్ధ్వంతుషోడశాత్ ॥౨౨౯॥
నప్రాయశ్చిత్తమేతావత్పర్యంతంతూర్ధ్వమేవహి,
ఉద్దాలకోదితప్రాయశ్చిత్తంకృత్వోపనాయయేత్ ॥౨౩౦॥
ప్రాయశ్చిత్తమకృత్వైవనకుర్యాదుపనాయనం ॥౨౩౧॥

* జన్మాది ఐదవ సంవత్సరము నందుగాని, ఆరవ సంవత్సరము నందుగానిఏడవసంవత్సరమున గాని, బ్రాహ్మణునకు ఉపనయనము చేయవలెనని "గర్భాష్టమేషుబ్రాహ్మణము

పనయీత" ఆప-గృ-౧౦-౨॥ యను సూత్రమున కర్థముచెప్పబడినది. క్షత్రియునకు నవమాదూర్ధ్వము ఉపనయనము చేయవలెననియు, వైశ్యునకు దశమాదూర్ధ్వము చేయవలెననియు, ఆపస్తంబమతము. వేదాధ్యయనతదర్థ జ్ఞానాది ప్రకర్షకృత తేజఃకాముఁడగు బ్రాహ్మణునకు ఐదవ సంవత్సరమునందును హస్త్యశ్వాదిరాజ్యబలార్థియగు క్షత్రియునకు ఆఱవ సంవత్సరమునను బహుకృష్యాదిచేష్టార్థియగు వైశ్యునకు ఎనిమిదవ సంవత్సరమునను ఉపనయనము చేయవలెనని మనువు మతము. వటుఁడు గొప్ప మేధాశాలి అయినచో బ్రహ్మవర్చసమును కోరుకొని ఐదవ సంవత్సరమున గాని, ఆఱవసంవత్సరమున గాని, ఏడవసంవత్సరమున గాని, ఉపనయనము చేయవలెనని గృహ్యాంతరములయందు చెప్పబడియున్నది. బ్రహ్మవర్చసకాముఁడగు వానికి తొమ్మిదవ సంవత్సరమున ఉపనయనము చేయవలెననియు, దశమ సంవత్సరాదూర్ధ్వము చేయబడు కామ్యోపనయనము మధ్యమము అనియు, పదమూడవయేఁడు దాటిన పిదప చేయబడు ఉపనయనము అధమమనియు, పదునాఱవయేఁడు దాటిన పిదప ఉపనయనము చేసినయెడల పతితుఁడగుననియు, కశ్యపుఁడు వ్రాసియున్నాఁడు. పదునాఱవ సంవత్సరము దాటువఱకు అనుపనీతప్రాయశ్చిత్తము చేయనక్కఱలేదు. షోడశవత్సరములు నిండిన తర్వాత ఉద్దాలకునిచే చెప్పబడిన అనుపనీత ప్రాయశ్చిత్తమును చేసి ఉపనయనమును చేయవలెను గాని, ప్రాయశ్చిత్తము చేయక ఉపనయనము చేయకూడదు.

## ఉపనయనప్రాయశ్చిత్తము

మాసౌ ద్వౌ సహ యావకేన పయసా మాసం తు
పక్షంనయే। త్యద్రేణా ష్టదినం ఘృతేన షడహం భాయా
స్థితేనాంభసాతిస్ర శ్చాపి తిథీరహా ర్నరశనం బాహ్యే
త్విదు ద్దాలకప్రోక్తం। చే త్యుపనాయన ప్రకరణే గృ
హ్యాంత రేష్వాదితం ॥౨౯.౨॥

రెండు మాసములు యావక భక్షణమును, అనంతరము ఒకమాసము పయోభక్షణమును, తర్వాత ఒకపక్షము ఆమిక్షభక్షణమును, అనంతరము ఎనిమిది దినములు ఘృత భక్షణమును, పిదప ఆఱుదినములు నీడియుండుచున్న చల్లని ఉదకమును భక్షించుటయు, పిమ్మట మూడుదినములు రాత్రిభోజనమును చేసి బాహ్య ప్రదేశమునందు ఉండుటయు, ఉద్దాలకప్రోక్త ప్రాయశ్చిత్తమని గృహ్యాంతరమందు చెప్పబడియున్నది.

ఉపనయనకాలము

వసంతో గ్రీష్మశరదౌ వర్ణత్రయాణాం క్రమశస్స్మృతాః
ముఖ్యా మాఘాదిమాః పంచ మాసంతో ఇతి కేచన ॥౨౧౬॥

బ్రాహ్మణునకు వసంతఋతువు ఉపనయనమునకు యోగ్యమనియు, క్షత్రియునకు గ్రీష్మఋతువు అర్హమనియు, వైశ్యునకు శరదృతువు శుభమనియు, చెప్పియున్నది. మాఘాది పంచకము ముఖ్యమని కొందఱు చెప్పుచున్నారు.

అనుపనీతప్రాయశ్చిత్తము

పూర్వేద్యు రాచార్య ఉపాత్తశిష్య స్స్నాత స్సభార్య
స్సమలంకృతాంగః, పుణ్యాహ నాందీముఖ కృత్స్వయం
హి కృచ్ఛ్ర త్రిభి శ్శుద్ధ్య సువర్ణ ధాన్యైః ॥౨౧౭॥
నిర్వాపయేదుపై రుపనేతృ యోగ్యతా సిద్ధ్యై పవిత్రీ
కృత గాత్రవాం స్తతః, కృచ్ఛ్రై స్త్రిభి శ్శిష్య శరీర
శోధనం బ్రాహ్మ్య మృచం గ్రాహయితుంచ కారయేత్॥

ఉపనయన పూర్వదినమున మంగళస్నాతుడును, అలంకృతుడును, పత్నీసహితుడును, అగు ఆచార్యుడు శిష్య సహితుడై పుణ్యాహవాచనమును నాందీశ్రాద్ధమును చేసి, ఉపనేతృయోగ్యతాసిద్ధికొఱకు కృచ్ఛ్రత్రయముచే పవిత్రుడై గాయత్ర్యుపదేశార్హతకొఱకు శిష్యునకు గూడ కృచ్ఛ్రత్రయము చే శరీరశుద్ధిని చేయవలెను.

అచ్ఛిన్న కౌపీన ధృతస్య తద్వటోః
కర్తవ్య ముక్తం నవ తంతు ధారణం,
పరంపరా ప్రాప్త కులాధిదేవతా
సంస్థాపనం కార్య మథాపరేహ్న్యపి ॥౨౧౮॥
చౌలం కృతం నో యది పూర్వకాలే,
చౌలం చ కృత్వోపనయేత నో చేత్
జాతా వ్యతీతా న్యఖిలాని యాని
క్రమేణ కార్యాణ్యఖిలాని తాని ॥౨౧౯॥

నూతన కౌపీన ధారియగు వటువునకు నవతంతువును వేసి వంశాచార ప్రాప్తకులదే

పశ్చాత్ప్రతిష్ఠ చేసి, పరదినమునందు ఉక్తకాలమునందు చౌలము చేయబడనిచో చౌలమును చేసి, ఉపనయనము చేయవలెను. జాతకర్మాదిచౌలాంతములగు కర్మలు తత్తదుక్తకాలములయందు చేయనిచో అజాతకర్మాదికర్మలను చేసి ఉపనయనము చేయవలెను.

### పాహిత్రయోదశహోమము

పూర్వోక్త కర్మ కరణే హ్యధికారసిద్ధ్యై
పాహిత్రయోదశ ఘృతాహుతి హోమమత్ర
కృత్వా వ్యతీత జననాద్యఖిల క్రియాశ్చ
కృత్వోపనయన ముశంతి విధింవిధిజ్ఞాః ॥౮౮॥

పూర్వోక్తజాతకర్మాదికర్మలను చేయుటకు అధికారము కలుగుటకై పాహిత్రయోదశహోమమును చేసి, అతీతములగు జాతకర్మాదికర్మలను చేసి, ఉపనయనము చేయవలెనని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు.

### ఉపనయనము

పరేద్యు రాచార్య వటూ సుమంగళ
స్నాతౌ చ భూత్వా సమలంకృతౌ తతః।
కటే కుమారం హ్యుపవేశ్య దక్షిణే
హ్యాసీన ఇత్యుత్తరత స్స్వయం తతః ॥౮౯॥
ఇమం వటుం కాశ్యప మాని గోత్రం
యజ్ఞేశ శర్మాణ మిహోపనేష్యే।
సంకల్ప్య చౌలం కృత వేదికాయా
మగ్ని ప్రతిష్ఠాపన మత్రకుర్యాత్ ॥౯౦॥

ఉపనయన దినమున ఆచార్యుడు మంగళస్నానము చేసి అలంకరించుకొనినవాడై మంగళస్నాతుడు అలంకరించుకొనినవాడు అగు వటువును తనకుదక్షిణభాగమున కూర్చుండజేసి "ఇమంకాశ్యపసగోత్రంయజ్ఞేశశర్మాణముపనేష్యే" అని సంకల్పించి అలంకృత వేదికయందు అగ్నిప్రతిష్ఠాపనము చేయవలెను.

బధ్వా కుమారస్య చ కంకణం త
త్కర్మాంగ తద్బ్రాహ్మణ భోజనం స్యాత్ ।

తై ర్భక్తవద్భి శ్శుచిమంత్రవద్భి
శ్శైవా శిషాం వాచన మాచరంతి ॥౨౬౧॥

అనంతరము వటువునకు కంకణమును కట్టి కర్మాంగమగు అభ్యుదయ శ్రాద్ధమునం దు భుజించినట్టి భక్తులు, శుచులు, వేదవేత్తలు అగు బ్రాహ్మణులవలన ఆశీర్వాదమును పొందవలెను.

అభ్యుదయశ్రాద్ధము

బ్రాహ్మణా న్భోజయిత్వేతి యత్ర యత్రో పదిశ్యతే ।
తత్ర తత్రా భ్యుదయిక శ్రాద్ధ మిత్యవగమ్యతే ॥౨౬౨॥
సర్వార్ధి కర్మ కర్మభ్యః పూర్వేద్యు స్సద్య ఏవవా। బ్రా
హ్మణా న్భోజయే దష్టౌ హిరణ్యేనా దనేనవా ॥౨౬౩॥
ఇత్యయం గౌణపక్ష స్స్యా న్ముఖ్యో ద్వావింశతి ర్ద్విజాః
తదా భ్యుదయిక శ్రాద్ధం వక్ష్యామ స్త్వా త్ర విస్తరాత్ ॥
ఆశిషో వాచయిత్వేతి పుణ్యాహం కర్మణస్స్మృతం। తత్క
ర్మ సర్వే జానంతి గృహ్యజ్ఞా యాజ్ఞికా ద్విజాః॥౨౬౪॥
శుచీ న్మంత్ర వత స్సర్వ కృత్యేషు భోజయే దితి,
ప్రాహా చార్యః కేషు చిదా దా వంతేషు కేషుచిత్ ॥౨౬౬॥
చౌలో పనయనా న్నాది ష్వాదా బ్రాహ్మణభోజనం।
ఉదీరితం కుమారాణాం శేష భోజన సిద్ధయే ॥౨౬౭॥

ఎచ్చటెచ్చట "బ్రాహ్మణాన్భోజయిత్వా" అని చెప్పబడునో అచ్చటచ్చట అభ్యుదయిక శ్రాద్ధము చేయవలెనని తోచుచున్నది. సమస్త శుభకర్మలయందు పూర్వదినమున గాని, తత్కాలమునగాని, ఎనమండుగురు బ్రాహ్మణులను నిమంత్రించి, అన్నముతో గాని, హిరణ్యముతోగాని, అభ్యుదయిక శ్రాద్ధమును చేయవలెను. అభ్యుదయిక శ్రాద్ధమునందు ఇరువది ఇద్దఱు బ్రాహ్మణులకు పెట్టుట ముఖ్యపక్షము. ఎనమండుగురు బ్రాహ్మణులకు పెట్టుట గౌణపక్షము. అభ్యుదయిక శ్రాద్ధము ముందు సవిస్తరముగా చెప్పబడును. "ఆశిషోవాచయిత్వా" అనుటవలన చెప్పబడుకర్మణఃపుణ్యాహ వాచనమును గృహ్యవిదులగు యాజ్ఞికులందఱు ఎఱుగుదురు. "శుచీన్మంత్రవతస్సర్వకృత్యేషుభోజయేత్"

అని కొన్ని కర్మలు అవిమంత్రకములు, కొన్నికర్మలుమంత్రవంతములు, అపస్తంబాచార్యులు చెప్పి యున్నారు. చౌలము, ఉపనయనము, అన్నప్రాశనము, మొదలగు కర్మలవిధానము వటువులకు చేసుభోజనమునే బ్రాహ్మణభోజనము చెప్పబడినది.

యజ్ఞోపవీతధారణకాలము

యజ్ఞోపవీతం త్వితి వాచయిత్వా
యజ్ఞోపవీతం ఖలు ధారయేదిహ।
కేచి చ్ఛివస్వామి మతానుసారిణః
కుర్యుః పురస్తా చ్చసమి న్నిధానతః॥౪౬॥

"యజ్ఞోపవీతం" అను మంత్రమును వటువుచే చెప్పించి యజ్ఞోపవీతమును ధరింప చేయవలెను. శివస్వామి మతానుసారులగు కొందఱు సమిదాధానమునకు పూర్వ యజ్ఞోపవీతధారణమును చేయించుచున్నారు.

భోజనా చమనే స్వాధ్యాయే చ యజ్ఞోపవీ త్యభూత్
ఇత్యా చార్యః ప్రాహ తస్మా ద్యజ్ఞోపవీత ధారణం॥౪౭॥
ప్రాగ్భోజనా చ్ఛ్రేయ ఏవ సదాచారాచ్చ నిశ్చితం।
యజ్ఞోపవీతినం చైకం కుమారంభోజయే త్పృథక్। ౪౮॥

"భోజనఆచమనేస్వాధ్యాయేచ యజ్ఞోపవీతీస్యాత్" ఆప-ధ-౧-౧౫-౧॥ అపస్తంబుడు చెప్పుట వలన భోజనాత్పూర్వమందు యజ్ఞోపవీతమును ధరించుట మంచిది యగునని శిష్టాచారము వలన కూడ నిశ్చయింపబడినది. యజ్ఞోపవీతి ధారియగుకుమారుని వేఱుగా భుజింపచేయవలెను.

కుమారభోజనము

అన్నా ద్యశేషో చిత భోజ్య పూరితం
పాత్రం చ గాయ త్ర్యభిమంత్రితా శనం।
అపోశనే నాహుతి పంచకై ర్యుతం
తం భోజయేచ్చోదర పూరణం యథా ॥౪౯॥
తత్రా శిషో వాచయిత్వా కుమారం భోజయేదితి।
మదా చా ర్యేణ చోక్తత్వా న్న మాత్రా సహభోజనం॥

మాత్రా సహైవాశనమత్ర నాస్త్యతో
 చార్యేణనోక్తం నతు సర్వసమ్మతం !
శాస్త్రార్థ మస్తీతి వదంతి యే ద్విజా
 స్తే చానభిజ్ఞాం ధ పరంపరాహి ।౪౭ ॥
వటోశ్చ మాత్రా సహభోజనం మదా
 పస్తంబ సూత్రే తు తథా శ్వలాయనే,
సూత్రేష్వనుక్తం హి తతో ననుష్ఠితం
 శిష్టైశ్చ వృద్ధై రపి సూత్ర వేదిభిః ॥౪౮।
సమాన పంక్తా వపి వా సహాశనం
 యేషాం చ గృహ్యేతు విధీయతే,
తచ్ఛాఖినామేవ తదుక్త సత్క్రియా
 విరుద్ధ గృహ్యత్వ దితి నాన్య శాఖినాం ॥౪౯॥

అశేషభోజ్యపదార్థపూరితమగు భోజనపాత్రను గాయత్రిచే అభిమంత్రించి, అపోశనానంతరము ప్రాణాహుతిపంచకము నుపచ్ఛుకొనిన కుమారుని ఉదరపూరణము అగునట్లు భుజింప చేయవలెను. "అశేషో వా వయిత్వా కుమారం భోజయిత్వా" అప-గృ-౧౦-౧౧॥ అని ఆపస్తంబాచార్యుడు చెప్పనందువలన తల్లితోకూడ కుమారుని భుజింప చేయకూడదు తల్లితో కలిసి భుజించవలెనని ఆపస్తంబుడు చెప్పకపోవుటయేగాక, ఆశ్వలాయనాది సంమతముగూడ కాదు ఈవిషయమై శాస్త్రార్థము గలదనువారలు అంధపరంపరలోనివారు. తల్లితో కలిసి భుజించవలెనని ఆశ్వలాయనాపస్తంబసూత్రములయందు అనుక్తమగుటవలన సూత్రవేదులు, వృద్ధులు అగు శిష్టులు తల్లితో కలిసి కుమారుని భుజింప చేయుటలేదు ఏ సూత్రమునందు మాతృపంక్తియందు కుమారునకు భోజనము పెట్టవలెనని కథించబడియున్నదో తత్సూత్రానుసారులే అట్లు చేయవలెను గాని అన్యసూత్రానుసారులు అట్లు చేయకూడదు.

## క్షౌరకర్మయందు కుమారనామోచ్చారణప్రకారము

అతో దాత్రే సత్యే సౌ శబ్ద ఏవ
 నామ బ్రూయా ద్విష్ణుశర్మా సుశర్మా।

దేవస్యో దాత్తేపి చైవా నుదాత్తే
శర్మన్నిత్యే వా పృథం చాత్ర వర్ణం ।౪౭౬॥

ఇత్యాదిమంత్రములయందు అసౌశబ్దము అంతోదాత్తమగునపుడు "విష్ణుశర్మాసు శర్మా" యని ప్రథమావిభక్తి చెప్పవలెను. "అవృధమసౌసోమ్య" అనుమంత్రము గాక "దేవస్య" ఇత్యాదిమంత్రములయందు ఉదాత్తమైనను అనుదాత్తమైనను "కేశవశర్మన్, నారాయణశర్మన్" అని సంబుద్ధివిభక్తి చెప్పవలెను.

పాత్రాసాదనము

కుశాం బు కూర్చా జిన వస్త్ర మేఖలా
దండా శ్మన శ్చేతి సకృ త్ప్రయోజయేత్।

కుశలు, ఉదకము, కూర్చము, అజినము, వస్త్రము, మేఖల, దండము, అశ్మ అను పాత్రలను ఒక్కమారే ప్రయోగించవలెను.

ఆచార్యవటువులు చెప్పతగినమంత్రములు

స్యా త్సామిధేనీ మిమ మగ్న ఆయుషే
హ్యగ్నిష్ట ఆయు స్త్వృచ ముచ్చరే ద్గురుః ॥౪౭౭।
ప్రాహావయే న్మాణవకం తు వాచయన్
యోగాది మంత్రా న్నవ హావయేదితి।
ఇయం దురుక్తా దజినస్య మంత్ర
మాగంత్రాసమ గన్మి తి చాప్యుదాయుషా ।౪౭౮।
సమంత్ర మేతా న్యపి మేఖలా దీ
న్యథో పున ర్మాణ వకం తు వాచయేత్।

"ఆయుర్దాదేవ, ఇమమగ్న ఆయుషే, అగ్నిష్టఆయుః" అనుమంత్రములను ఆచార్యుడు చెప్పవలెను. యోగాదిపదునొకండు మంత్రములలో ద్వితీయచతుర్థమంత్రములు గాక శేషించిన తొమ్మిది మంత్రములను మాణవకునిచే చెప్పించుచు, హోమము చేయించవలెను. అని ఆపస్తంబుడు చెప్పియున్నాడు. ఇయందురుక్తాత్, మిత్రస్యచక్షుః, ఆగంత్రాసమగన్మహి, ఉదాయుషా, అనుమంత్రములను ఆచార్యుడు చెప్పుచూ, మేఖలాదులను ధరింప చేయుచూ, కుమారునిచే చెప్పించవలెను.

